


పద్యకావ్య సంకలనము


రచన

కైలాసవాసి

జనమంచి వేంకటరామయ్య



జనమంచి ప్రచురణలు

రాజమండ్రి - 5

# కావ్యానుక్రమణిక

# ప్రకాశకుల విజ్ఞప్తి

మానాయనగారు కైలాసవాసి, జనమంచి వేంకటరామయ్యగారు శివసాయుజ్యం పొంది యిప్పటికి అర్థశతాబ్దము నిండుచున్నది. ఔరసులమైన నేనూ, మా చెల్లి మహాలక్ష్మి పాత్రో, తమ్ముడు రామకృష్ణ కలిసి యీ నాటికి వారి పరిశిష్టకావ్యములను – "త్రిదశి" – గా, సరస కవితో పాయనములుగా అందించుటకు వేగిరపెట్టినది మా అంశుమంతుల,, ఆయుష్మంతులు నైన, బ్రహ్మానందపాత్రో, వేంకటరామయ్యలు.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఆకాడమీ వారొసగే రూ 1500/– ఆర్థిక సహాయము నకు – చన్నీళ్లకు వేన్నీళ్ల తోడైనట్లుగా – యీ ఆయుష్మంతుల ఆర్థికసహాయంతో ఈ ప్రచురణ సాహిత్యలోకం వెలుగు చూడగలుగుతోంది.

ఈ కావ్యసంకలనమును పరిశీలించుటయే గాక, కవి కావ్యాత్మను ఆసాంతము వారి మునుపటి "నవకుసుమాంజలి" కావ్యసంకలనములోగూడ ప్రవేశించి, అనుశీలించి, కైలాసోన్నత శిఖరముదృశ్యమానమయ్యే విశాలసోపానముల నిర్మితి కూర్చిన పండితకవి శేఖరులు – "హమేషా" సత్కావ్య రసా స్వాదన ప్రమత్తులు – శ్రీ మల్లంపల్లి శరభేశ్వర శర్మగారు మా ప్రయత్నమును అభినందించినందులకు మనస్సులో భృశమ్ము వందించుకుంటున్నాము.

సరసాళికి ఆమోదభాజనమయ్యే మా నాయనగారి, యితర రచనలన్నీ, ఉత్తర రామచరితము (భవభూతి), మేఘసందేశము (కాళిదాసు) వే వెలుగు చూడాలనే వారి బలీయమైన ఆదేశాన్ని కూడామనసా వందించుకుంటూ ప్రయత్నశీలురము కాగలమని మనవి చేస్తున్నాము.

ఈ సంకలనములోని కావ్యములన్నియు నాయనగారి జీవితకాలములో ధారావాహికంగా, చాల వరకు, 'ఆంధ్రపత్రిక' సారస్వతాను బంధములలోను, 'భారతి' లోనూ ప్రకటింపబడినవే !

ఈ పత్రికాధిపతులకు మా కృతజ్ఞత.

ఈ కావ్యావళి 'త్రిదశి' ప్రచురించుటకు వలయు సంభారములను, నా ఆర్థిక దైన్యమును గుర్తించి, సమకూర్చ అభయమిచ్చి గడువు మించిపోకుండ ప్రతిని సుందరముగా అచ్చొత్తించి అందించిన సుహృద్వరులు, సరస్వతీ పవర్ ప్రెస్ అధినేతలు శ్రీ అన్నపల్లి నాగేశ్వరరావుగారికి మా కృతజ్ఞత అందిస్తున్నాము.

'కవియోగి' యైన మా నాయనగారి దివ్యస్మృతికి ఈ కావ్య సురభిళ సుమములను 'త్రిదశి' పళ్లెరమున బెట్టి నివాళిపట్టి, ఆశీఃభిక్షను అర్థించుచున్నాము.

పరుగులు వారే కాలహరిణము రేపిన ధూళిపిహిత జ్యోతిర్లింగ సుమపరాగములు 'త్రిదశి' లో ద్యోతకమవును గాత !

ఈ 'త్రిదశి' లోని సాహితీ సౌరభములు విశాలాంధ్రావనిలో బాలేందు చూడామణి కృపను దశదిశలకు 'ప్రాకుంగాక !'

ఇ తి శి వ మ్ !

బా-బాపూ భవనం
రాజమహేంద్రవరం

జనమంచి కామేశ్వరరావు
28-6-1982

శ్రీ శివాభ్యాం నమః

# మెట్లు

"త్రిదశి" అను కావ్య మానస తీర్థమునకు మెట్లుగా ఈ అనుశీలనము ఉద్దేశింపఁబడినది.

*మయి కృపాం కురుదేవ సదాశివ
త్వమసి మే శరణం సుఖకారణం
తవ దిదృక్షురహం దురితాపహం
హృది శుభావహ మంఘ్రి సరోరుహం.

సాఁగెన్ యోగము మంచుఁగొండపయి నిశ్శబ్దంబుగా నీకుఁ గ
ల్పాగచ్ఛాయ సుఖాసనంబు గిరికన్యా సేవయుంగల్గ; నే
దీ ! గన్గొందును బూనుమింకఁ గలహోధివ్యాధి దారిద్ర్య సే
వా గర్భ్యంబగు నాదు సంసరణమన్ పంచాగ్ని మధ్యంబునన్।

కవియోగులైన జనమంచి వేంకటరామయ్యగారు శివసాయుజ్యము పొంది నేటికి ఏఁబది సంవత్సరములు కావచ్చుచున్నది.

ఈ కవిచంద్రునకు ప్రియతమములైన యీ గోదావరీ తీరము, ఈ అశ్వత్థ వృక్షము, ధ్యేయమైన శ్రీ మార్కండేయ శివలింగము ఈయన శివభావనకు సాక్షులై నేటికిని అట్లే నిలిచి యున్నవి.

---

* నవకుసుమాంజలి

జ్ఞానాకృతియైన శివస్వరూపమే యీ కవీంద్రుని కావ్యవస్తువు. ఈయనతత్త్వాను భవము సత్యస్వరూపము. కవి కారూపము పొందిన ఆ యనుభవ నిష్యందము సౌందర్య స్వరూపము. సన్ననిదయ్యును అది ఆంధ్ర శారదా మౌళితలమున అమృతకళయై వెలుఁగుచున్నది.

బహుతపఃఫలమై యుదయించి అమృతనిష్యంద రూపమైన యీ ఆత్మ కళోదయమును స్వానుభవైక సాక్షికముగ అనన్య సాధారణరీతిని ఈయన యిట్లు వివరించి యున్నారు.

♦ "ఇంద్రియ గోచరంబగుచు నేవిషయంబో కవీంద్రుడెందమున్
సాంద్రవికారభాజన మొనర్చుచు నస్తమితాన్యభావని
స్తంద్రముఁజేసి యవ్వెనుక సర్వముఁదానయి నిండి పొంగి స్వ
చ్ఛందగతిన్ రసాకృతిని జాల్వాఁగ,నదె కావ్యమయ్యెడున్.

ఇంద్రియ గోచరమైన ఒకానొక విషయము జపాకుసుమమువలె, శుద్ధ స్ఫటిక సంకాశమైన కవి హృదయమును రాగరంజితమొనర్చుచు, ఇతర భావములను అస్తమింపఁజేసి, క్రమముగా అంతయును తానై నిండియుండి, పొంగి, స్వచ్ఛందముగ రస స్వరూపమై జాలువాఱి కావ్యముగ మాఱును.

సృష్టిలో సర్వకావ్యములును పుట్టెడు క్రమమిట్టిది. నిజమైన కావ్యములిట్లే పుట్టును. ఈ కవి కావ్యములు పుట్టినక్రమము నిట్టిదియే. విషయమునుబట్టి కవిహృదయ వృత్తి, కవి హృదయవృత్తిని బట్టి విషయము రసముగా రూపాంతరమునొందుట – అను అవిరత వ్యాపారము వలన కవి హృదయమే సర్వరసములకు జన్మభూమి.

---

♦ అమృత కలశి

హృదయైక ప్రభవమైన రసము హృదయైకవేద్యమే యగును. అది ప్రియుల అనురాగమునుపోలినది. ఇట్లు కవిని, చదువరిని ఒక్కటిగా కరఁగించు కవితాస్పందములు స్వచ్ఛందములు. అవి-

రమ్మన్నన్ వెసరావు, రావలదనన్ రాకుండఁగాఁబోవు: ర
మ్యమ్ముల్ కైతలకుం గళాకళలు వేళావేళలుం గల్గు సం
ద్రమ్ముం బొందెడు పాటు పోట్లకు ఒలెన్"

ప్రేమ త్రోవలెట్టివో కవితల త్రోవలును అట్టివి; సముద్రమును ఆవేశించెడి పాటు పోటుల వలెనే అవి రమ్మన్నచో వచ్చునవియు, రావలదన్నచో మానునవియును కావు. వానికిని కళాకళలు, వేళావేళలు నుండును.

"వ్యతిషజతి పదార్థానాం తరఃకోఽపి హేతుః" అని- తొల్లి ఆంతర ప్రణయ వృత్తులకు కారణాన్వేషణ మొనర్చిన భవభూతికి-హృదయ ధర్మమును బట్టి యీ కవి అన్నయో! తమ్ముడో! అనిపించక మానదు.

ఈయన రచించిన పెక్కు పద్యములిట్టే హృదయమునకుఁదాఁకి కాళిదాస, భవభూతి ప్రణీతములైన పద్యములకువలె చర్వణామృతములై యుండును. మఱి కొన్ని శ్రీపుష్పదంత శంకర భగవత్పాద ప్రణీతములైన పద్యములవలె అనుసంధాన యోగ్యములై పావనములై యుండును.

ఈకవి ఆవిర్భూత జ్యోతి! ఒక్కొక్క పద్యము అక్షరరూపమున ఘనీభవించిన ఆలోపలి వెలుగు!

"ఆకాశంబున నొక్కటొక్కటిగ సంధ్యావేళఁ జుక్కల్ బలెం
బైకిన్ వచ్చెడి పద్దియంబులివి సువ్యక్తంబులై; యభ్యసూ
యాకారంబుదమాలి కీవరణ తంత్రాపాయ ముక్తంబులై,
ప్రాకుంగాక భవత్కృపం దొలుకున్ బాలేందు చూడామణీ:'

బాలేందు చూడామణీ! అనుటవలన ఈపద్యములకు, శివునకుఁ గల సంబంధము, ఇందు – నక్షత్రసంబంధము వంటిదని సూచితము. అవి, దూరమునకు చుక్కలవలెనే కనిపించును గాని, చేరువకుఁ బోఁగలిగినచో ఒక్కొక్కటి ఒక్కొక్క తేజోమయ లోకము!

• "హృదయాకాశము మీఁది మీఁదికిని నీ వెక్కంగ నెక్కంగఁ జి
న్నది కాఁజొచ్చెడు, నాదు నీడవలెనే, నాచిత్త సంకల్పమున్;
గుదురై నిల్వఁగ నీవు నట్టనడుమన్ శూన్యంబగున్ హేవిభో !
పొదలున్ వెండియు నీవు డిగ్గినఁ దమః పుంజాకృతిం దాల్చుచున్.

నడిమింటన్ రవినిల్పి చీఁకటుల నానా దిక్కులందోలియున్
వెడలింపంగ నశక్తుఁడౌ నురుగుహా విశ్రాంతమా ధ్వాంతమున్,
గడుఁజోద్యంబగు నీవు మానస గుహా గర్భస్థ రత్నంబవై
యడఁగంజేయుదు దుస్తమం బఖిలమారా శర్వ! సర్వేశ్వరా!"

మరి కొన్ని పద్యములను చూచినపుడు కడచిన జన్మలలోని యోగపథముల యందలి అడుగు జాడలు పొడకట్టు చుండును.

• "పొడవౌ కల్పమునందు నిల్చి ఫలముల్ భోగించి భోగించి, యీ
సుడిగుండంబునఁ గర్మ వాయు వశతన్, శోచ్యుండనై వెండియుం
బడితిన్, జీర్ణదళంబు నంటిపడు చీమంబోలి విశ్వేశ ! నన్
గడఁకం జేర్పవె ! యొడ్డునం గృపను యోగ భ్రష్టు సర్వేశ్వరా !

ఎగురంజాల విహంగ మార్గమున నీయెత్తే శుకాదుల్ బలెన్
నగుబాటుం బెను చేటుఁ బాటిలును క్రిందంబడ్డ; నేనింకఁ బ్రాఁ
కఁగనుంజాలను మెల్లఁ జీమవలె గంగా యాత్రకై; తీవ్రమం
దగఁతు ల్గావిఁక నాకు నేమిగతి యార్తత్రాణ బోధింపవే !

జీవితములో ఈకవికి వచ్చిన విపత్పరంపర ఒక్క జీవికి రాఁదగినదికాదు. సోదరవియోగము, పుత్త్రవియోగము, నయనావరోధము మొదలైనవి యీ కవి మనో దృష్టిని విక్షిప్త మొనర్చుటకు బదులు ఏకాగ్రమునే యొనర్చినవి.

ఈయన వ్యక్తిత్వము దొంతరలుగొని అరఁటిపూవువలె పొడఁగట్టును ఉపాధ్యాయుడు, గ్రంధవ్యసని, మననశీలి, కావ్యతత్త్వవేత్త, రసజ్ఞుడు, భక్తుడు, జ్ఞాని, కవి, యోగి, ద్రష్ట !

"ఆరోగ్యంబుచెడెన్, గుటుంబభరణాయాసంబు హెచ్చెన్, సుదు
ర్వారుల్ పైయధికారులైరి, మఱి సేవాశక్తి భాగ్యంబనన్
దూరస్థంబగు, జీవితంబు వెగటైతోఁచున్."

పరిశీలింపగా, ఈ వ్యధలన్నియును పైపొరలలోనివే. ఈకవి జీవతత్త్వము లోపల ఒక అమృతపుబుగ్గయున్నది. ఆదియే యీయనను కవిగా శాశ్వతునిఁజేసినది. సోదర వియోగాదులు, దుఃఖములై యీయనను క్రుంగించుటకు బదులు,- కావ్యవస్తువులై ఈయనలోఁగల ఆయమృతపుబుగ్గను పొంగించి ఆజల్లులో తాముకూడ రసమయ కావ్యములుగా రూపాంతరమొంది శాశ్వతములైనవి. మృత్యువులో మృత్యుంజయుని దర్శించి దుఃఖమును ఆనందముగ రూపాంతరమొందించిన యీకవి దృష్టి నిజముగా స్పర్శవేది. ఒక యమృతకళ, నిత్యానపాయినియై యీయన జీవుని వెన్నంటియున్నది. అదియే ఆత్మకళయైన యీయన కావ్యకళ !

"ఈ శూన్య ప్రపంచమందు ఆ దేవి కొక్కతెకే నేను గావలసినవాడను. నాకు, గావలసినదియు ఆదేవియే. ఏమనగా, కవితయే నాజీవిత సర్వస్వము. కవితయే నాకు స్వర్గద్వారము. కవితయే నాకు మోక్షసాధనము"

---

**అమృతకలశి** – నవకుసుమాంజలి విజ్ఞాపనము

అని అహార్యనిశ్చయుడైన యీ కవీంద్రుఁడు చెప్పికొనఁగలిగినాఁడు. ఇట్టి దృఢప్రత్యయమే లేనినాఁడు – ఎవ్వఁడును కవిశబ్దవాచ్యుఁడు కాలేఁడు.

మొదటినుండియు – ఈ గౌతమీతీరము "కవులకుఁగాణాచి" అను జనప్రవాద మెట్లున్నను మఱి – యీ కడచిన నూఱేండ్లలో ఆ కాలప్రభావ మెట్టిదోకాని! శతాధిక గ్రంథకర్తలతోఁ గిక్కిరిసియున్నట్లు గోచరించును.

మామిడిపండ్ల కాలములో 'కంబాల చెరువుగట్టు' వలె గద్య రచయితలు, పద్య రచయితలు, కవులు, సత్కవులు మహాకవులు-ఎల్ల తెగలును ఒకే కాలములో, ఒకే చోట, ప్రోఁగులు ప్రోఁగులై పడియున్న యీ యపూర్వసన్నివేశము ఒక్క యీ నగరమునందే కాననగును.

వాఙ్మయ వైవిధ్యమునకు–ఇదియొక యిరుకైన పెద్ద విపణి. ఎంత సందడి! ఎన్ని యుద్యమములు! ఎన్ని సంస్కరణములు! ఎన్ని పత్రికలు ఎన్ని వాదములు! ఎన్ని వ్యవహారములు! వీరేశలింగముగారు, వేంకటరత్నంగారు, సుబ్బారాయుడుగారు, లక్ష్మీనరసింహంగారు, కృష్ణమూర్తి శాస్త్రిగారు వ్యాసమూర్తి శాస్త్రిగారు మఱియును ఎందరో మహానుభావులు!

వీరిలో ఒక్కొక్కరిది ఒక్కొక్క యుద్యమము. ఒక్కొక్క సంస్కరణము. ఒక్కొక్క పత్రిక. ఒక్కొక్క లోకము! వీరేశలింగముగారివి అనేకోద్యమములు అనేక సంస్కరణములు!

అది ప్రతిభకన్న పరిశ్రమయే పెద్దగా పరిగణింపఁబడిన కాలము. అప్పటి వారిలో శతాధిక గ్రంథకర్తలు కొందఱు అరుదు

యశస్సు, అర్థకరణము, వ్యవహారజ్ఞానము, శివేతరక్షతి, సద్యః పరనిర్వృతి

– అను కావ్య ప్రయోజనములలో ఆనాటి పలువురి దృష్టి—

పూర్వాపూర్వ ప్రయోజనమునందే నిమగ్నమైయున్నట్లు గోచరించును.

ఇచ్చట - ఒకమాట చెప్పవలసి యున్నది.

వేంకటరామయ్యగారు నాయకత్వము వహించిన యుద్యమముగాని చేసిన సంస్కరణముగాని నడపిన ప్రతికగాని లేవు. స్వభావతః ఇట్టి సందడులకు ఆయనది దవ్వుగా తొలఁగి యుండెడి శాలీనమైన మనఃప్రవృత్తి. మఱి – సమకాలికులకు వచ్చిన ప్రసిద్ధి యీయనకు రాలేదు.

యశస్సువేఱు. ప్రసిద్ధివేఱు. కాలాంతరములలో రానైనది యశస్సు. బ్రదికిన నాళ్లలో బహు మార్గములుగా వచ్చునది ప్రసిద్ధి. కాలము గడచినకొలఁది యశస్సు సముజ్జ్వల మగుచుండును. ప్రసిద్ధి మాసిపోవును. కవి భావుకుల పరంపరలలో స్థిరముగా నిలిచి యుండునది యశస్సు. తత్కాలమునందు పామరులలో వ్యాపించునది ప్రసిద్ధి. కవితాగుణ వైభవము చేతనే లభింప వీలైనది యశస్సు. ప్రచారబలము చేత సిద్ధించునది ప్రసిద్ధి.

కాళిదాసు మొదలైనవారు కోరుకొన్నది యశస్సుకాని ప్రసిద్ధికాదు.

'భవేత్ ప్రసిద్ధిర్బ్బహు మార్గలభ్యా
నానాపథైస్తే కవయో భవంతి
శైలీచ, భాషాచ, రసోఽథ భావః
శ్రుతేః పథో దూరతరం ప్రయాతాః (విశ్వనాథ)

తత్తత్ కాలలక్షణములను బట్టి విలువలు తాఱుమాఱుగుచున్నట్లు తోఁచునే కాని అనంతకాలమందు సారభూతమైనదియే నిలుచుట పరమేశ్వర సంకల్పము. కానిచో మనకు భారత భాగవతాది వాఙ్మయము నిలిచి యుండెడిది కాదు.

"ఉత్పత్స్యతేఽ స్తిమమకోఽపి సమానధర్మా"
అన్న ఆత్మప్రత్యయమే ఉత్తమ సాహిత్యసృష్టికి జీవనౌషధము.
వేంకటరామయ్యగారిది అట్టి ధీరమైన ఆత్మప్రత్యయము.

* "మెచ్చి వసుకవీంద్రు, మెచ్చరేనియతండు
మెచ్చుకవిత సరసులిచ్చ, నది య
పూర్వ సరసతయగుఁ బొరయునే దేవి ! నా
ముదము వైపరీత్యమది కతముగ.

ఆ 'అపూర్వ సరసతా' స్వరూపమెట్టిదనగా —

తెలిసి యొకఁడు మెచ్చఁదలఁద్రిప్ప నింకొక్కఁ
డద్దిచూచి గంగిరెద్దు వోలె :
తాతమ్మతిని వినుచుఁ దల్లి గొల్లనఁ దల్లి
యేడ్పుసూచి బిడ్డదేడ్చినట్లు

"భక్తచింతామణి" కర్తయైన వసురాయకవిది, పరమేశ్వరుని యెదుట– తద్విభూతియైన యీ విశ్వమునెదుట – నిలువఁబడిన అద్భుత రస పరిపూర్ణమైన శిశు దృష్టి ! ఆ కావ్యమునందెల్లయెడల గోచరించునది – ఈ శిశు మనఃప్రవృత్తియే!

"జననీ గర్భములోన నుండఁగ విదేశంబేగి పెక్కేండ్లకున్
జనుదేఁ దండ్రినిఁ గాంచు బిడ్డవలెం, నీసంబంధమున్ ముందునేఁ
గనకీవేళ నెఱింగి స్నేహభయ శంకాముత్త్రిపాశ్చర్య భా
జనమై నిల్చితిఁ జేరఁ దీసికొనవే ! సద్భక్త చింతామణీ !"

ముగ్ధమునైన యిట్టిభావములు వెంటనే సర్వజనులకు హృదయములకు హత్తుకొనును. అందలిప్రతిపద్యము పరమేశ్వరుని కృపయను చెట్టునుండి రాలిన ఒకపండు, ఒకపూవు. అందులో పరమేశ్వరుని కృపదక్క భావించుట కేమియుండును? ఆయన ముక్తకరచనయం... కృతహస్తుఁడైన భక్తుఁడు. పరమేశ్వరుఁడు ముక్తకరచనకు తూఁచి

---

* అమృతకలశి

నట్లు సరిపోవు కవితా శక్తిని ఆయనకు అనుగ్రహించెను. పద్యములన్నియును ఒకే మూసలో పోసినట్లుండును. వైవిధ్యము లేదు. భావము పద్యవలయములో బిగింపఁబడినట్లుండునే కాని, పూవువలె రేకులు విచ్చుకొనుచున్నట్లుగఁ దోచదు ఆ బిగింపులో పలుచోట్ల సంధి బంధములు శ్రుతికటువుగా నుండుటయును దోఁచును. పండితులకు గూడ ఝుడితిస్ఫూర్తికలుగదు. ఇమిడికయున్నంతగా శ్రుతిసుఖము గోచరించదు. స్వచ్ఛందప్రవాహగతి తక్కువ. క్రొత్తభావము రానిదే ఆయన కలమెత్తని మాట నిజమే. జనసామాన్యము ఆ భావము చేతనే ఆకర్షింపఁబడును. శ్రుతిసుఖము చెడని నిర్మాణసౌష్ఠవమును ఆస్వాదించుటకు సాహిత్యరసములో మాఁగిన శ్రవణేంద్రియము తప్పక యుండవలయును. జనసామాన్యమున కదియుండదు.

♦ "పద్యమెంత ప్రౌఢభావమైనను శ్రుతి
కింపుగాక మతికి నింపుగాదు
కంటి కింపుగాక గాదింపు నోటికి
నెట్టి మధురవస్తువేని నిజము."

అదియునుగాక — వేంకటరామయ్యగారి కవితలో వాచ్యాంశము కన్న ప్రతీయమానాంశమెక్కువయుండును. కావున వసుకవీంద్రుని మెచ్చినవారు వసుకవీంద్రుఁడు మెచ్చిన వేంకటరామయ్యగారి కవితను మెచ్చకపోవుటలో ఆశ్చర్యము లేదు. స్వయముగ కవియగుట వలన కవిత్వపు లోతులు తెలియుటచే వసుకవీంద్రులు వేంకటరామయ్యగారి కవిత్వమును మెచ్చికొనుచుండెడివారు. ఇందువలన వేంకటరామయ్యగారు "కవీనాంకవిః" అనెడి శ్రేణిలోనివారని తేటపడుచున్నది.

"భక్తచింతామణి" సర్వమతములవారికిని సమాదరణీయమగుటలోఁగల రహస్యము ప్రధానముగ అందలి దైవమునకు నామరూపములు లేకుండుట యొకటి.

---

♦ అముద్రిత కవిత

పునః పునరావృత్తమైన పితాపుత్రసంబంధమొకటి. అందును ఛందః ప్రతిబంధము వలనఁ గొన్ని సందర్భములలో 'ముకుందా!' అనుటగమనింపఁదగియున్నది. మొత్తము మీద ఆ గ్రంధము చదువునప్పుడు శ్రీకాళహస్తీశ్వర శతకమో, దాశరధిశతకమో చదువు నప్పటి ఆత్మీయత అనుభవమునకు రాదు. నామరూపముల మాధుర్యమట్టిది! "నవకుసుమాంజలి"లోఁ గూడ శివానందలహరి మున్నగు సంస్కృత గ్రంధములలో వలెనే మకుటనియమము లేదు. అయినను అచ్చటచ్చట 'బాలేందుచూడామణీ!' అనియో "ఖండేందుచూడామణీ" అనియో అన్నప్పుడు గుండెఝల్లుమనక మానదు.

మొత్తము మీఁద నాటి రాజమహేంద్రవర కవులలో వసురాయకవియే కవితా గుణమును బట్టి వేంకటరామయ్యగారికి కొంత సన్నిహితులుగా వచ్చునట్లు గోచరింతురు.

♦ వినతుండై తన విద్దెవేఁడు చిఱుతన్ ప్రేల్వట్టి దిద్దించుఁ గా
దనడుం, జేయఁడు శక్తివంచన మసూయంజేసి; యట్లౌట నె
ట్లొనరించున్ గురుధర్మ కోవిదుఁడె యయ్యున్ సత్కృపామోది య
య్యును ద్రోణుండల సుబ్బరాయ కవితో నొప్పారఁగా సఖ్యమున్.

వేంకట రామయ్యగారికి వసుకవీంద్రుని యందుఁగల గౌరవభావము పై పద్యమునందు తేటపడుచున్నది.

"నవకుసుమాంజలి" భక్తచింతామణి కంటె పెక్కు సంవత్సరముల తరువాతి రచన. రెండును భగవత్ పరములే కాని "నవకుసుమాంజలి" రచనకు శ్రీ శివానంద లహరి, శివమహిమ్నము ఉద్బోధకములు. భగవత్పరములైన తలంపులు ఊహలువేఱు. భావములు వేఱు. తలంపులలో ఊహలలో అద్భుతాశ్చర్యముల వైచిత్రి యుండును. "భక్తచింతామణి"లో ఈ అద్భుతాశ్చర్యములే బహువిధములైన ఉల్లేఖములతో నెల్ల యెడలఁ గాననగును. అది ఆపరిధిని దాటిపోలేదు.

---

♦ అమృతకలశ

కావ్యరచన మూడు విధములు-

* "వస్తువుతోడి యైక్యమును భావనసేసిన సుప్రశస్తమౌ
వస్తువుకన్న భిన్నుఁడయి వర్ణన సేసిన మధ్యమంబగున్
వస్తువుఁ దానుఁ గాక మఱి పాఠకుఁడుం దనబుద్ధి నిల్చినన్
ధ్వస్తమగుం గవిత్వమది ప్రజ్ఞనె వెల్లడిసేయఁ బూనుటన్.

ఇందు "నవకుసుమాంజలి" రచన మొదటి మార్గములో నడచినది. "భక్త చింతామణి" రచన రెండవమార్గములోఁ బ్రయాణించుచు మూడవమార్గమునకు మొగ్గుచున్నది.

వస్తువుతో ఐక్యము భావించి నపుడు అస్తమితాన్య భావమై యుదయించిన దానికే 'భావ' మని ప్రసిద్ధి. అట్టి 'భావ' మునకే రసస్ఫూర్తియుండును. హృదయము తన్మయమై ద్రవీభావమునందుటకు 'భావ' మే ఆలంబనము. అట్టి భావముల స్వరూపము ఇట్లుండును.

"దివిజ నదీతటంబులను దియ్యని పచ్చిక మేసి మేసి త
త్పవిమలవారిఁ గ్రోలి సురపాదపమూలమునందుఁ గామధే
నువు తొలిచూలి పోలిక మనోజ్ఞతరాకృతినొప్పి నీడ సే
వ వలను సూచుచున్ నెమరు వైచుచు నందివలెన్ సుఖంబుమై -

ఉండక బండియెద్దునయి యుర్వి జనించితిఁ గాఁడి మోవఁగాఁ
గండలురేగి పుండులయి కాయలు కాచిన మూఁపు క్రుంగ ను
ద్దండతఁ బట్టి కొట్టెడును దండధరుండయి కర్మచోదకుం
డండ యొసంగి యీ పశువునాపద లెప్పుడు పాపెదో ప్రభూ?

---

* అమృత కలశ - నవకుసుమాంజలి

మఱియును ఇట్లుండును.

♦ నేలం ద్రొక్కెడి పూవుఁదీగ వలెనే, నేనుందునో దేవ! న
న్నీ లోకంబున కేలదెచ్చితివో! నా కెచ్చోటు నేమించితో!
పూలా పూవను, మొగ్గలాతొడువనున్, ప్రేమోద్వైన గానుం, బసుల్
కాలం ద్రొక్కగ ప్రుక్కుచుందు నిది నాకర్మంబె? సర్వేశ్వరా!

♦"నవకుసుమాంజలి" యిట్టి భావములకు ఖని. తననుండి వెలువడిన భావములలో తాను కనుమఱుఁగై యుండియే ప్రాణకళను ప్రతిష్ఠించి మూర్తిమంతములైన ఆభావములను చదువరుల గుండెలో కదలునట్లు చేయు కౌశలము ఈకవికిఁ గలదు.

♦"ఆఁకట నేడ్వనోపునని యారయ వచ్చినతల్లిఁజూచి తా
నేఁకటవాసి యేడ్పుడిగి యెత్తు మఱంగిన బిడ్డవోలె ని
న్నే కనుగొంచునీశ! సుఖియించెద నెమ్మదిఁగోర కన్యమున్
గైకొని నాదుప్రార్థనల గ్రచ్చఱ నన్గన రావె! యీశ్వరా!

ఏదియొ చూచి బూచియని యెంతయు బెగ్గిలి యాటమాని య
త్యాదృతి నమ్మ! యమ్మ! యని తల్లియొడిం దలదాఁచుబిడ్డకున్
మేదిని మీఁదఁ దాన తన నీడను జూచి కలంగి మృత్యువం
చాదట నిన్నుఁ జేరెడి భయార్తున కేది విభేద మీశ్వరా!

ఇట్లే – మాటలకు అందని యోగానుభవములకుఁ గూడ విస్పష్టమైన రూపమును – ఈ కవి కల్పించును.

ఒడలన్ దగ్గఱి యంటి నట్టులగు, వాయుస్పర్శముంగాదు; న
ల్గడలం జేర్చెడు నొక్కచోటి, కయినంగా దంధకారంబునున్
గడెయుం గంటయు జామునుండెలియ, వైనన్ నిద్రయుంగాదు; బ
ల్విడిమై వృత్తి విశేషమొండు హృదయా విర్భూతమై యీశ్వరా!

♦నవకుసుమాంజలి

♦ మౌనమ! చంచలేంద్రియ సమాజ కవాట పిధానమా! నినున్
ధ్యానము సేతు నాపయిని నల్లన ప్రాలుము ; శాంతి దేవికిన్
మానుగ నీవు నాల్కవఁట! నా చెవి సూఁదవె తద్రహస్యమో
మానిత భావరత్న ఖని ! మాటలు వేయుననేల నాకిఁకన్ ?

భావమె లోనఁ బాడుకొను పాట విధంబున నింపుసేయు; ద
ద్భావముఁ బల్క పల్క యిఁకఁ బానకమందలి పుల్లయేయగుం
గావున మౌనమూని యవికల్ప సమాధిని నిల్పి చిత్తమున్
భావ వికారదూరు, నిను భావన సేసెదనో మహేశ్వరా!

రాగము పాడిపాడి మధురంబుగఁ దత్కృతి వెన్కఁ బాడరో
బాగుగ ముందు తత్కృతిని బాడుచుఁ దత్కళ వెన్కఁ జూపరో
యే గతినైన నేమి సుఖమేగద రెంటను నిల్చి పొల్చెడున్
యోగికి నిర్గుణంబు మఱియున్ సగుణంబు నొకండె, శంకరా!

ఐహిక జీవితమునందు సుఖదుఃఖభోక్తగా సంసారబద్ధుడుగాఁ గానవగు జీవుఁడు ధ్యానయోగము వలన గుహాశయమైన శివస్వరూపముగఁ బరిణమించుచున్న స్థితి "నవ కుసుమాంజలి"లో పెక్కుచోట్ల విస్పష్టముగా గోచరించును.

ఒంటిం జీఁకటి మౌనమూని యొకటేదో మెల్లఁ జింతించు కాం
చుంటే వేడ్కఁగఁదోచునాకెపుడు; నేఁడో యద్ది రెట్టించె; నే
మంటేనిన్ నినుఁగూడియుండుటను, దివ్యంబైన నీవెల్గుఁగ
న్గొంటన్, నీ పలుకాలకించుట నెదన్, యోగీశ ! సర్వేశ్వరా !

♦ ఛాయా రూపములద్దమందుఁగననౌ చందాన నీమాయచే
నీ యందుండు సమస్త భూతములునన్; నీవుండ వవ్వానిలో
మాయంబై యవి కాలకర్మవశతన్ మబ్బుల్ బలెన్ బోవఁగా
నోయీశా ! వెలుగొందెదంబరమునన్ జ్యోతి స్స్వరూపంబునన్.

ఈవున్నేనొక తల్లిబిడ్డలమె సుమ్మీ ! యొక్కపెన్ దివ్వటీ
నే వెల్గించిన జోడు దివ్వెలమె సుమ్మీ ! యీశ్వరా ! నాకిఁకన్
నీవే పెద్దవు ముందుపుట్టుకతనన్, నీ క్రింద నేనుందు, నా
హా ! వింతౌనిక, నీవు నేను నొకటే; యాదివ్వటీ వెల్గులో !

మామక హృత్సరోవిహరమాణ మరాళవిభుండవైన నా
సామిని నిన్ను నేమని ప్రశంసయొనర్తును ! భక్తి పెంపునన్
రాముఁడవన్ననున్ బురవిరాముఁడవన్నను మౌనిమానసా
రాముఁడవన్ననెంతొ యభిరాముఁడవౌదువు నాకుమాధవా !

ఈయన కేవల కవికాఁడు. కేవల యోగియును కాఁడు.
శివత్వమునందుచున్న కవియోగి.

పూర్వకవుల కవితా మార్గములకు విజాతీయము కాని త్రోవలలో ఒక క్రొత్త వెలుఁగు వేంకటరామయ్యగారి ప్రతిపద్యమునందును నిండియుండును. అది అంతశ్చక్షుర్వికసనమువలన లోపలినుండి ప్రసరించుచున్న వెలుఁగు కాని వెలుపలినుండి తెచ్చికొన్న వెలుఁగుకాదు.

## అమృతకలశి

"క్రొత్తత్రోవఁద్రొక్కి క్రొత్తసీమలఁజూపి
క్రొత్తచవులఁదేల్చి చిత్తములకుఁ
గ్రొత్తవికసనంబుఁగూర్పని యాకైత
సెప్పియేమి ? యింకఁజెప్పకేమి ?"

♦ నవకుసుమాంజలి - అమృతకలశి

ఒకఁడు కవియగుటకుఁజేయవలసిన సాధనలను, తపశ్చింతనలను అన్నింటిని ఈకవి "అమృతకలశి" లో నిక్షేపించెను. కావ్యజగత్తున అడుగిడఁగోరువారు ఆ చింతనలను తప్పక ఆనుసంధించితీఅవలయును. కవియగుమాట ఎట్లున్నను సరియగు రసజ్ఞతయైన అలవడితీఱును. ఇందులో - ఈయన వివేచించి నిగ్గుతేల్చని కవితామార్గము లేదు. "కావ్యజ్ఞశిక్షయా అభ్యాసః" అన్నదెట్లుండునో, ఇదిచదివినచో తెలియును. సంస్కృతమున రాజశేఖరుని "కావ్యమీమాంస" యెట్టిదో తెనుఁగున కిది యట్టిది ఇందులో - ఈయన వ్యావహారిక భాషావాదము కావ్యనిర్మాణమునకు పనికిరాదని ఖండించి నవ్యసాహిత్యవాదుల పగకుఁబాత్రమయ్యెను. ఈయన కృతులకు కలుగవలసినంత వ్యాప్తి కలుగకపోవుటకు అదియొక ప్రబలహేతువు. అది విషయాంతరము.

ఈ కృతియంతయును మననతపః ఫలము. ఈయన అంతర్మథనమునుండి వెలువడిన కావ్యతత్త్వామృతము !

ఆ యమృతము ప్రాతిభమైన అంతశ్చక్షువును వికసింపఁజేయును. నిఖిలార్థములను వెలిఁగింపఁజేయు ఆ - లోఁజూపే కవికి మూఁడవ కన్ను !

వేంకట రామయ్యగారి కవితా వ్యాసంగము ఆ కాల లక్షణమును బట్టి అనువాదములతో మొదలైనను ఈ అంతశ్చక్షుర్వికసనము వలన ఆయనకు తెలియకయే ఆయనలోని కవితాత్మ రూపు గట్టుచుండెను. కవిత్వమును ఆయన పరమానంద రసానుభూతికి సాధనమైన యోగమునుగా దర్శించెను. ఆయనకు కవిత్వము, యోగము, రెండు కాదు అందువలననే ఆయనది కవితాయోగము.

వ్యుత్పత్త్యభ్యాస శక్తులతో, వాణీప్రసాద విశేషము వలన తొల్లింటి సంస్కారములు పచేళిమములై వసంత శ్రీ సమారంభవేళ చివురు గుబురులలో దాఁగియున్న వన ప్రియ కంఠ కుహళి నుండి హఠాన్నిర్గతములైన మధుర ధ్వనులవలె,

శివ మూర్ధోపరిభేల దంబర ధునీ దివ్య ప్రవాహములవలె, బహుతపః ఫలములైన కవితా ప్రవాహములు ఆయన గళమునుండి వెలువడి దాహోపశమనములై, విబుధులను ఓలలాడించెను.

ఆ కవిత, గాజు కుప్పెలతో కాశీ నుండి కొనితెచ్చిన గంగాజలము కాదు. అది స్వచ్ఛందమైన దివ్యప్రవాహము.

తత్త్వ వేత్త, సత్యమును సౌందర్యముగ గానము చేయుటకు కవియై తిరిగి జన్మించును. కవి ద్విజుడగుట యిందుకే !

♦ " జననీ ! నీదు కృపా కటాక్షమున వాక్సామ్రాజ్య ధౌరేయతన్
గనఁగంటిన్, గనఁగల్గి క్రొత్త వెలుఁగున్ గల్యాణి నీ మోమునన్;
జననంబందుచు నేఁడు, క్రొత్తగను నీసౌవర్ణ గర్భంబునన్ !
గనెదన్ గ్రొత్త ప్రపంచ మొండిదె ! నమస్కారంబు వాగీశ్వరీ !

సరస్వతీ స్వర్ణగర్భమునుండి తేజోవలయముతో - కవి యీపృథివిపై నవతరించును. ఆ వెలుఁగులోనుండి చూచినపుడుగాని కావ్యనిర్మాణ రహస్య తత్త్వము తేటపడదు.

♦ చెప్పఁడుకవి, భువినితరుఁడు
చెప్పెడుక్రియ, మఱుఁగువిడిచి, చిత్రంబేదో
గుప్పిటనిడి యూరించును
జెప్పికొనెడి దాఁక తండ్రి శిశువులను బలెన్

పెదవి కదలింపకుండ నవ్వీన యలంతి
నగవు కనుదోయి క్రేవల నిగిడి, మొగము
దమ్మి వికసింపఁజేయు చందమున మెఱసి
ప్రౌఢ కవి వాక్కు హృదయంబు నలరఁజేయు

---

♦ అమృత కలశ

మనకు మానవ భాషలు మాత్రమే తెలియును. మనమెఱుగలేని ఒక అపూర్వ భాష కవికిఁ దెలియును.

• " తెలుగున్, సంస్కృత, మాంగ్లి తెయమని ప్రత్యేకంబుగాఁ గొన్నిభా
షలె కొదన్ని యెఱుంగ నేరుతురు ప్రజ్ఞాచణులై దక్షులై
ఆలలున్ గాలులు మబ్బులున్ బలుకఁగా నయ్యర్థ మూహించుచున్
బలుక న్నేరుతు, రింపుగాఁ బ్రకృతికిన్ భాష్య ప్రణేతల్ కవుల్ "

కవి హృదయము కామ ధేనువు పొదుగు. అది మధుర రస పూర్ణమై మాటి మాటికిఁ జేపి అమృతధారలు కురియుచుండును. కవి హృదయమున భావముదయించు క్రమమిట్టిది.

• "ఆవి, రదృశ్య రూపమున నర్యమ తప్త మహార్ణవోద్గతం
బై వినుం వీధిఁ జల్లగ నవాంబుద రూపము నొందు నట్లుగా
నేవొ యసంగతార్థము లనేకముగా హృదిఁదోఁచి భావముల్
వేవిపులత్వ మొందెడు వివేక సమీకృత రమ్యమూర్తులై "

నిజముగ రసజ్ఞుడైనవాడు అవశముగతనయానందము ప్రకటించును. ఇతరుడుఁ

• 'మౌనంబున్ భజియించు నన్యసుమనో మాధుర్యధుర్యోక్తిచే
నానందించియు, నభ్యసూయయొ! యసభ్యంబొ దురభ్యాసమో!
జానే యిద్ది రసజ్ఞ ధర్మము? మరందాస్వాదనాపాదిత
స్వానందంబు మలీమసాళియు, బొరింజాటుంగదా! ఝుంకృతిన్?

---

• అమృత కళ

తెలుగు పలుకుల మాధుర్యమిట్టిది-

• "తియ్యని ద్రాక్షపండ్లకును దీటయి తేనెయరంటి పండ్లకున్
వియ్యములై రసాలముల నెయ్యములై మజిజుంటి పాలకున్
దియ్యములై యెసంగు మన తెన్గులు వీనులవిందు సేయ, న
క్షయ్య ముదంబునన్ బ్రదుకఁ గల్గుదు మన్నము నీళ్ళులేకయే!"

మంచి కవిత్వము రచింపఁ జాలనిచో నిస్స్పృహనొంద నవసరములేదు. కుకవిత్వము రచింపకుండుటయే పదివేలు.

• "ప్రతి పద్యంబు రసాస్వదంబుగ రచింపన్ శక్తిలేదేని, పం
డితులున్ బామరులున్ జెలంగి పొగడన్ లేవేని నేర్పుల్, పురా
కృతమింతేయని చింతనొందఁదగ దింకేమన్నఁ బ్రాజ్ఞుండు సం
స్కృత కావ్యామృత పానమత్తమతియై క్రీడించుటొప్పంగదా!

ఈహితోపదేశము నూటికి నూర్వురును ఆచరణలో బెట్ట దగినది. అప్పుడు దేశములో సరియైన రసజ్ఞత యేర్పడుటకు మార్గమేర్పడగలదు.

"పద్యం బల్లుటయే కవిత్వమని సంభావించు సాహిత్యసద్
విద్యాగంధ దరిద్రులెంచ నరులే? పెంజీఁకటిం గానలో
ఖద్యోతంబులఁ జూచి నిప్పులనుచుం గాగ్గన్ జలింబ్రీతిమై
నుద్యోగించెడి వెఱ్ఱివానరులె, గాకూహించి చూడంగడున్.

• నిలుకడయె వలయు నేనిన్
నిలుకడయే వలయుఁ గృతికి; నిమిషార్థములో
పలనిండి పొంగి పొరలెడి
సెలయేఱడగెడు; నడఁగునె జీవనది యికన్ !

---

• అమృత కలశ

ఇట్లు పద్య రచయితల నుండి మహాకవుల వఱకుగల అంతరువు లన్నియు వివేచింపబడి "అమృత కలశి"లో నిర్దేశింపబడినవి. కాని ప్రతిభాది పరికరమున్నంత మాత్రము ననైన కావ్యము నెరవేరదు. కవిత్వమునకు అనుభూతియే మూలద్రవ్యము.

## సోదర స్మృతి

ఈకవికి సోదర వియోగము సంభవించినది. ఈయన హృదయములో ఆ దుఃఖము కొన్నినెలలు మాఁగినది.

ఈయన భావన, గహనములైన మృత్యుతత్త్వ కుహరములలో అన్వేషణకు త్రోవలు దీయ మొదలిడెను.

'ప్రాణి చేతిలో జీవిత రహస్యమను అపూర్వ ఖాద్యము పెట్టి కన్నుమూసి పసివానిని దొంగవలె మృత్యువు తనవెంటఁ దోడ్కొనిపోయి అదృశ్యమగును'

"మృత్యువు - జీవనసముద్రమునంతయును ఆరఁగ్రోలియును కుతితీఱక వేగుచున్న బడబాగ్ని! సమస్తజీవులను నమలకయే మ్రింగెడి ఒకానొక అదృశ్యమహాసర్పము! ఎల్లశ్రమలనడఁగించి చల్లఁగ ఆక్రమించికొనెడు ఒకపెద్దనిద్దుర!"

అది – "వ్యక్తావ్యక్తములను దృశ్యాదృశ్యములను కలుపు గోదావరి మీఁది వంతెన! ఆవలియొడ్డున ఏమున్నదో తెలియదు. దీనిపై వాసనావశులైన కొందఱు జీవులు భూమ్యాకాశముల మధ్య రాకపోకలు చేయుచుందురు"

"తమతమ తఱిని భువిని దివిని ఆవరించు వెలుఁగుచీకఁటులే జీవితమరణములు"

"ఈయింటిలో భుజింతుము. ఆయింటిలో నిద్రింతుము - జీవితము మరణము కూడ నిట్టివే అగునేమో!"

"ఎక్కడినుండి వచ్చుచున్నావు ? ఎక్కడికి పోవుచున్నావు ? ఎందులకిట్లు తిరుగుట ?" – అని ప్రతిదినము ఉదయాస్తమయములలో పక్షులు సూర్యుని పెద్ద రొదగా అడిగినదే అడుగుచు ప్రత్యుత్తరము పొందుటలేదు"

"ఆఱుచున్న దివ్వె కాంతివలయము క్రమక్రమముగా తగ్గుచున్నట్లు – పాఱుచున్న ఏటివెల్లిలో నడిమి చిఱులంక మునిఁగి పోవుచున్నట్లు – తెలివి క్రుంకుచుండగా నేను మృత్యుస్వరూపమును జూచితిని"

'చెడిపోయిన వీణనుండి స్వరసమ్మేళనశక్తి యుడిగిపోయినట్లు భూతపరిణామమైన దేహమునుండి చైతన్యము పోవుటయే మరణమందురు. జ్ఞానమంతయును సంస్కార ప్రబుద్ధమైన స్మృతి. వెనుక 'నేను' లేనిచో స్మృతియెచ్చటిది ?

ఈ విధమైన అన్వేషణలో ఆత్మనిత్యత్వమును కనుగొనిన యీ కవి – సంసృతి బద్ధజీవుల పునరావృత్తిక్రమము దర్శించి మనోహరముగ నిట్లునిరూపించెను.

♦ "ఇంతన్ గ్రంధసమాప్తియంద్రదు తరువాయేమాత్రమున్ లేదటం
ద్రంతర్వేదికిఁబైన నూళ్లవలలేవంద్రయ్యయో ! ఆత్మకున్;
సంతప్తాంబుధి బాష్పమట్లది యదృశ్యంబై దివింజేరి, యా
సంతాపంబు శమింపవెండి చినుకై జాఱున్ భువిన్ దమ్ముడా !

కడుపునఁగొన్నిడిందెడు నకాలపుమృత్యువె చాతకంబుగా;
పుడమినిరాలుఁగొన్ని, తడుపుంబయిపై నటుకొన్ని, కంటినీళ్
ముడుచునుగొన్ని, నించుఁబరితుష్టిగఁజిన్కులు కొన్ని, శుక్తిలో
బడినవి ముత్తియంబులయి స్వామికి హారముఁగూర్చుఁదమ్ముడా !

మోహపుఁజీఁకటులయందు ముంచవలసిన దుఃఖము, కవికి అతీంద్రియార్థదర్శనమునకు అంజనమై శాంతిసమాధానములను అలవరించినది.

---

♦ సోదర స్మృతి

ఇష్టవియోగ దుఃఖితులైన జీవులెల్లరకు ఇట్టియూరటను చేకూర్చెడు కవి దుఃఖము కూడ విశ్వశ్రేయమునందు పర్యవసించి కావ్యప్రయోజనము చరితార్థమగుట యిందుఁగాననగును.

అవిచ్ఛిన్న మహాప్రవాహినియైన యీ జీవనదికి జీవితమరణము లుభయతీరములు!

• ''ఆవలియొడ్డుఁజేరి కుతియారఁగఁగ్రోలుము స్వచ్ఛజీవనం
బీవలి యొడ్డునన్ బసుల యెక్కుడు త్రొక్కుడుచే జలంబు పం
కావిలమయ్యె, నైననది యంబరగంగయటన్న పూర్ణసం
భావనఁజేసి త్రావుదుము ! వాస్తవమిట్టిదికాదె ! తమ్ముడా !

ఇది ఎంత కరుణభరితమైన హృదయాశ్వాసము!

* ''ఆకాశమ్ముననుండి శంభుని శిరోద్వారంబునన్ భూమిపైఁ
బ్రాఁకన్నేర్చిన బిడ్డకట్టులు రజస్స్పర్శంబుచే నైనదే,
కా, కీకల్మషమెన్నఁగా సహజమే గంగామహాదేవికిన్
లోకోజ్జీవని లోకపావని నెటుల్ దూషింపనౌఁ? దమ్ముడా!

గంగవలెనే - ఈకవితామహాగంగ రజస్సముద్భవములైన సర్వజీవకాలుష్యములను క్షాళనమొనర్చివైచి పరమశివ స్పర్శానుభవముచే పావన మొనర్చుచున్నది.

* ''ఒక చన్నిదరితల్లి గౌతమికిః నీయున్నట్టి యాయొడ్డు వే
ఱొక చన్నై; యెసగన్; సహోదరులమై యుప్పొంగు జీవామృతం
బకలంక స్థితిఁగ్రోలుచుందు, మిఁక దాహంబగ్గలం బౌటనా
సుకృతీ! నీవధికంబుగ్రోలఁదు విదేసుమ్మీ! విభేదంబనన్!

---

* పాపర స్మృతి

సుకృతులైన యీసోదరులిరువురును వాగ్దేవతయొక్క ఉభయ స్తనంధయులైన కాళిదాస భవభూతులవలె రసమయ లోకములలో నిత్యులై క్రీడింతురు!

మఱియును సోదర వియోగసంతప్తమైన యీకవి హృదయమునుండి ఆవిర్భవించిన యీ అఖండ కరుణగౌతమి – గతాసువులు అగతాసువులునైన సర్వజీవులను ఏకగర్భ జనితులనే యొనర్చి తన స్తన్యామృత క్షీరములచే, అపాళయితులను, ఆప్లావితులనుజేయుచున్నది.

కావ్యముల వలన కలిగెడి పరమోదాత్తమైన అమృతత్వ సిద్ధికి ఈ కావ్యము పరమమైన నిదర్శనము.

చిత్రముగ– ఈవియోగభావన కవికి సోదరునితో అవియోగ రూపమైన అద్వైత స్థితిని కలిగించి కవితా కైలాస శిఖరమునందు నిత్యునిగ ప్రతిష్ఠించుచున్నది.

• "నీకూర్పాసమునేఁ బయిన్ దొడుగుదున్. నీపాగ నేఁ జుట్టుదున్
నీకష్టంపడి కట్టినింట నిలుతున్, నిల్తీవు నాయాత్మలో
నీకన్నట్టి యనుంగు బిడ్డల,నిఁకన్నేఁ జూతునీకంటనే
నీకున్ నాకు విభేదమెక్కడిది నేనే నీవుగాఁ దమ్ముడా!

కరుణం బొక్కటియే రసంబనుట నిక్కంబేమొ చూడన్! భవత్
స్మరణంపున్ బెనుబుగ్గఁ బుట్టినదియై జాల్వారి చింతా పరం
పర లేళ్లై కలయన్ హృదాకృతి ముఖద్వారానఁ ద్వద్యోగసా
గర సంగంబు భజించుఁ జిత్రము వియోగంబేమనన్ దమ్ముడా!

ఈవే మూలమొ! యామహేశ్వరుడు తానే మూలమో! ప్రేమభ
క్త్యావేశంబునఁ బల్కు పల్కులివి సత్యజ్ఞాన మూలంబులై
భావింపంబడు నీవు నీశ్వరుడు నద్వైతస్థితిన్నిల్చి, నా
భావంబందు వెలుంగుటన్ సుగుణదీపా! సత్యనారాయణా!

---

• సోదర స్మృతి

♦ ఆడకె యాడుదున్ శ్రుతి రహస్యమెఱింగినవాఁడపోలె, నే
పాడకె యట్లు పాడుదు నహారముగా సుఖపారవశ్యముల్
చూడకె చూతునర్థముల సూరిజనంబులు తత్త్వముంబలెన్
నేఁడిదియేమొ నాహృదిని నిల్చి వెలుంగ శివుండు తమ్ముడా !

ఈపద్యములయందు రసాకృతియైన పరమశివుఁడు తాండవించుచున్నాడు. కరఁగుటకుముందు ''గుండె'' అను పదార్థమొకటి యుండవలయును. అది శిలయైనను కరఁగితీరును. ఇంతకాలమునకు పిమ్మట భవభూతివంటి కవి మనభాషలో పుట్టినాడు !

''కాలో౽హ్యయం నిరవధిర్విపులాచ పృథ్వీ''

అని ప్రతీక్షించు చున్నాఁడు. వాస్తవమునకు – ఈయన ఆత్మనుండి వెలువడిన ఈ అమృతకళ చేత వాఙ్మయమునందు – ఈయనకు సదాశివత్వ పదవి నిత్యమై వెలుఁగుచున్నది.

ఈయన మహాకవి యగుటయే కాక గొప్ప సాహిత్యా చార్యుఁడు.

తాను నిర్దేశించిన కవితా లక్షణములకుఁ దానే లక్ష్యమై నిలిచిన పూర్ణకవి. అనగా, " ఎవ్వడు కవి? " అన్నచో " ఇట్టి వాఁడని" చూపుటకు సంపూర్ణ లక్ష్యమైన వాఁడు !

ఈయన కృతి శకలములు కొన్ని యీ సంపుటిలో " త్రిదశి " యనుపేర సంకలనము చేయబడినవి.

నవకుసుమాంజలి, అమృతకలశి, సోదరస్మృతి అను మూడు దశలలో త్రికూటమునుండి దిగిన త్రిమార్గగ వలె – ఈ కవితావాహిని తన మార్గమునకుఁ దగిలిన వివిధ విషయ కేదారములను అమృతాప్లావితముల నొనరించుచు ఆంధ్ర వాఙ్మయ సీమల యందు "త్రిదశి" యై ప్రవహించుచున్నది.

---

♦సోదరస్మృతి

శిఖరములనుండి దిగునప్పటి వేగము వేఱు. మైదానముల మీఁది సమ ప్రసారధారా రమణీయమార్గములు వేఱు. ప్రసన్నత యందలి లోతులలో మిలమిలలాడు భావసౌందర్యము తామ్రపర్ణీ మౌక్తికము వలె చూపులో నుండి డెందమున కందునే కాని ఇదమిత్థమని చూపుటకు చేతి కందునదికాదు.

మాధుర్య రస సముద్రమైన శ్రీ కృష్ణ దైవము "వెన్నదొంగ" యై యీయన యెదలో 'దోబూచి' యాడి యీ కవిని మత్తకోకిలను జేసి క్రొత్తపాటలు పాడించెను.

ఆ మధురానుభవములు "కనులబెట్టిన చలువకప్రుఁగాటుక" వలె కరగి పోవునవి. అవి తమ తమ హృదయైక సాక్షికముగ అనుభవింపవలసిన "ఆనంద గీతము"లు !

'బండిచక్రము' సృష్టి నిత్యత్వమును గానము చేయుచున్న జనపదవధూ హృదయముల నుండి తరంగితమైన ఊడ్పుపాట ! వారు పుడమితల్లికి బిడ్డలు.

* "ఎండగాసిన వానకురిసిన నేళ్లకోళ్లను నేకమై
నిండిపాఱిన నూళ్లమున్గిన బండిచక్రము వోలెనే"

తిరుగుచున్న తమ బ్రతుకులలోని తత్త్వమును వారిట్లు పాడుకొనుచున్నారు.

"పట్టినారము మొన్ననే కొడవండ్లు పంటల కోతకున్
మట్టినారము విత్తుఁగట్టల ముందుపంటకు నేఁడిదే
విత్తుచుందుము కోయుచుందుము క్రొత్తయేమియు లేదిఁకన్
క్రొత్త యెప్పుడు బ్రదుక వలెనను కోర్కెయొక్కటియే యగున్."

---

* బండిచక్రము

కవులకు ధ్యేయమైన సౌందర్యదేవత భువిని దివియు ఒక్కటిగా "తూఁగుటూయల"లో ఊఁగుచున్నది ఆమె అందమునందే పుట్టినది. ఆనందము నందే పెరిగినది. ఆమె స్పర్శ వలన అఖిల సృష్టి అందముగ ఆనందముగ మాఱుచున్నది.

'భావగీతము'లో – ఇదికాదు, ఇదికాదు, అను వ్యతిరేక మార్గమున భావకవితా తత్త్వము వివేచించబడి తుదినిట్లు నిరూపించబడినది. ప్రకృతిదేవి యొక్క నిశ్చల సమాధియో, కనులు మూయని యోగనిద్రయో, అనఁదగు నిశీథ సమయమున, నీల గగనాంగణమునందు మినుకు మినుకు మను తారకల నిమీలనోన్మీలనములే తాళగతులుగా హృదయ తంత్రుల మీటుచు హృదయగతుడగు ఒకానొక గాయకుఁడు పలికించుచున్నాఁడు. ఏ హృదయమునకు ఆది వినగల నేర్పులున్నచో అది విస్పష్టముగ వినిపించును. అది అప్పుడు పుట్టిన నిసుపు నూరుపు కన్న సున్నితము. కాని – ఆ నిశ్వాసగర్భములో విపుల జలధి గభీర ఘోషలు వినబడును. ఆది విష్ణు నాభీ విమల కమల మిళింద నిస్వనము వలె సర్వతోముఖమైన నాదము. ఆది శ్రవణ హృదయ రసాయనము. ఎవ్వఁడు దానిని విని వినిపింప నేర్చునో అది కవనమగును. అతడు కవియగును.

ఈ కవితల యందలి వస్తు వైవిధ్యమును మొత్తము మీఁద – ఇట్లు వేర్పరించుకొనవచ్చును.

ఓ ప్రభూ, సుమాంజలి, సోదరస్మృతి, పుత్రశోకోర్మి

నిర్వేదగీతము, మృచ్ఛకటి – ఆత్మపరములు.

మొఘల్ సామ్రాజ్య పతనము, సుప్రభాతములు, త్యాగ వైభవము – దేశభక్తి పరములు.

ఆటగీతము, అన్నయు చెల్లెలును, శుక విలాపము – శిశుగీతములు.

అమృత కలశిఁ దొమ్మరి విద్దెలు – సాహిత్య విమర్శ.

కరుణ గీతము, నాదారి తోడు – మానవతా పరములు.

* "నీ సింహాసన మాక్రమించి యవలన్ నీ యౌదలన్ బ్రొద్దటుల్
భాసిల్ వజ్రము కోహి నూ రొలిచి త్వ ద్వైధవ్య చిహ్నంబుగా
నీ సామ్రాజ్యముఁ జేసి య స్తమితమున్, నిన్నేలు చున్నారనా
యాస ప్రాప్త మహా మహీతల జయ ప్రారంభ సంరంభులై"

ఇదీ బ్రిటిషు వారి రాజనీతి !

సుప్రభాతములు :- తూర్పుదేశములైన జపాను చైనా స్వాతంత్ర్య యుద్ధములకు సంబంధించినవి.

ఈ కవి దృక్పథమిది.

"ఒక యీశ్వరు కృప నందఁ
మొక యోడనె యెక్కి దాటి యొకసంద్రమునే
యొకతీరమె చేరఁగవలె
నిఁక నీసంశయములేల యిచ్చటనీకున్"

(నాదారితోఁడు)

నాకు ప్రియమిత్రులు కవిపుత్రిలు అయిన శ్రీ జనమంచి కామేశ్వర రావుగారి అనురోధమువలన ఈకవి కవితా తత్త్వానుశీలనమునకు ఉపక్రమించితిని. కాని - వేంకటరామయ్యగారు చెప్పినట్లుగానే—

* "చేరువయ్యె హృదయమునకుఁ;
జేరఁజనన్ గనకమృగము చెలువునఁబై పైఁ
బాఱెడిదయి—"

ఆ కవితా తత్త్వము నా అనుశీలనమున కందక నన్నలయించు చున్నది.

* ముఘల్ సామ్రాజ్య పతనము

ఆకర్ణాంతము నిండలాగి పృథుల జ్యాఘోష మేపారఁగా
నాకాశంబును ముంచి చీల్చుకొని లక్ష్యం బుచ్చిపోవేసినన్
దాఁకం జాలక కెంచి మానమయి మద్బాణంబు నేలంబడున్
నాకెట్లబ్బునొ పూర్ణలక్ష్య శరసంధానక్రియా నైపుణుల్ !

సహృదయులే ప్రమాణము.

"సమాచారం" బిల్డింగ్స్
రాజమహేంద్రవరము
19-6-1982

పుల్లంపల్లి శరభేశ్వరశర్మ
ఉపాధ్యాక్షులు
ఆంధ్రయువతీ సంస్కృత కళాశాల

---

*కనకమృగము –

# అక్షర సవరణ

| పుట | పంక్తి | సవరణ |
| --- | --- | --- |
| 3 | 11 | ప్రీల |
| 10 | 1 | పెల్లిద |
| 35 | 11 | నీ సామ్రాజ్యము |
| 51 | 6 | చెలికాండ్రు |
| 62 | 5 | దోనె |
| 67 | 4 | కమ్మ(దెచ్చె |
| 71 | 15 | గనరాద |
| 80 | 3 | ప్రాజ్ఞుల |
| 86 | 15 | భావజ్ఞుడైన |
| 94 | 2 | జ్ఞాని |
| 96 | 1 | నేను |
| 106 | 3 | విధంబున |
| 110 | 4 | నీ లీలా |

ఓమ్ !

“నమయనుచు మ్రొక్కి యిటుపూ
ర్వ మహాకవులకుఁబడయఁగఁ బ్రార్థింతుమిఁకన్
విమలయును, నాత్మకళయును,
నమృతా కృతియునయి యొప్పు నవ్వాణి కృపన్.”

భవభూతి

"ఆకాశంబున నొక్కటొక్కటిగ సంధ్యావేళఁ జుక్కల్ బలెం
బైకిన్ వచ్చెడి పద్దియంబులివి సువ్యక్తంబులై యభ్యసూ
యాకారాంబుదమాలికావరణ తంత్రాపాయ ముక్తంబులై
ప్రాఁకుంగాక భవత్కృపన్ దెసలకున్ బాలేందు చూడామణీ !

కవిమాత్రుండను రెండుతెక్కల గవాక్షంబట్లు వీక్షింపగన్;
గవి, శిల్పింగుడి తెక్కతోడుపడగన్ దాక్షిణ్యభావంబుతో;
నవుదున్ ద్రష్టనుగూడఁజిత్రముగనేఁడాతల్పు చిల్లింగనస్
సవిశేషప్రతిపత్తిగల్గుఁ, గవి ప్రజ్ఞాచక్షుడై నప్పుడే.

రచన
19-10-1932

1

# ఆనందగీతము

శ్రీకృష్ణాష్టమీవిశేషము

ఏమియిచ్చితివయ్య నాకిపు, డేమి కొంటివి నాకడన్
స్వామి, నీ తగిలించుకొన్నది వట్టివందుగబేరమే !
పామరున్ననువిల్చికొంటివి, వ్యర్థునిం జపలాత్మునిన్,
ప్రేమమీఱఁగ నమ్మి కొంటివి నన్నుఁ జింతామణినహో !

గ్రుడ్డిగవ్వకు వచ్చె హెచ్చగుకోటి కోట్లమహాధనం
బడ్డమేమిక వైభవంబున నద్వితీయుఁడ నైతిగా !
బెడ్డముక్కయు నీదు సత్కృపపేరి స్పర్శమణిం బ్రభూ !
దొడ్డ బంగరుకొండయౌఁ, దనుఁ దొట్టి సూర్యుఁడె చుట్టిరాన్.

గాలిబొంగరమట్లు పాఱితి గాలి యేకడవీచినన్
మేలు కీడనుకోక యాకడ మిట్టిపాటు ఘటిల్లఁగన్;
ప్రీవెసత్తువ, తూలెమైవడి వెచ్చనూర్పులు వెడలు నీ
పాలఁజేరితిఁ దల్లియొడిఁ జనుఁగ్రోలి కూరుకుబిడ్డనై.

పాడుచీకటి పేదకొంపకు వచ్చినాఁడవు సామి! నీ
కూడ నొక్కటఁ దెచ్చినాడవు కోటి సూర్యుల వెల్గు; నీ
నీడయేఁ గనరాదు, దానను నీవు వచ్చిన జాడయేన్,
ప్రోడవై కికురించినాడవు ! ముంచినాఁడవు కొంపయే !

మూగనై పడియుంటి నేనే మూలనో చలిముద్దనై
రాగమెల్లనశించి మనసువిరాగమొంది కృశింపగా;
మత్త కోకిలమట్లు నేఁడిదె క్రొత్తపాటలఁబాడెదం
జిత్త గింపుసు చేర్చి సీశృతిఁ జిన్నికృష్ణ ముదంబునన్.

రచన
7-8-1932

## 2

# బండి చక్రము

1

రావెయప్పరో ! రావె చెల్లెల ! రావె కోడలిపిల్లరో !
త్రావి వేగమె చల్దిగంజిని రారె యూడుపులాడ్పగా
ఆకసంబునఁ బ్రొద్దుపైకెగఁబ్రాఁకు చున్నది చూడరే !
ఆఁకవేష్టెడి తాళ్లముసుఁగున కాపరాని వెలుఁగుతో !

వానదేవునిరాకచే నెవలోని వేడియడంగ నెం
తేని పంట పొలంతి తెప్పిలి సించుఁగమ్మని యూర్పులం:
బూనఁగావలదేయిఁకందనమేనఁ బులకల పోలికన్
జానలార ! ముదంబుతో మననాటబోయెడి మొలకలన్.

మెత్త నౌచిత్తమున సీరికలెత్తు విత్తిన కోరికల్
రిత్తయై చనుఁదగులమెల్లను బొత్తుసేకుర నుండినన్
మైలదాఁకకయుండఁగుచ్చెలు మాఱఁచివెన్కకుఁ గట్టరే
ప్రాలుమాలికలేక నడుములు వంచి మూనలు వెట్టరే !

2

అన్నవస్త్రములిచ్చి ప్రోచెడియమ్మ తాను భూదేవికిన్ :
మున్ను గల్లుమనంగ గాజులు మ్రుట్టిచేతుల మ్రొక్కరే
తల్లికోడినిబిల్లలట్టులు తగిలికాళ్లను వ్రేళ్లనుం
దల్లిఁ గొల్చిన నోటికందెడుఁ బిల్లలార, యెదేనియుం

జోడిగింజయొ జొన్నగింజయొ చొప్పడున్ వరిగింజయో
కాఁడిమేఁడియుగట్టుదొరలకు గాదెలేయిక నిండెడున్.
కడుపునిండినఁజాలదే, యిఁకగాదె నిండకపోయినన్
బడుగుపాటకపుంగొలానికిఁబానకంబగు గంజియే :

జాలుజప్పలు గుట్టలై పడఁద్రవ్వి రత్నపురాసులన్
గోలకొండ నవాబు బంగరు గోడలందును దాపినాఁ
డెంతపాటున కంతియే ఫలమెంతయాఁకటి కంతెకూ
డెంతకల్మియు లేమియే యగుఁజింతలంబెను వంతలన్.

3

పట్టినారము మొన్ననే కొడవండ్లు పంటలకోఁతకున్
ముట్టినారము విత్తుఁగట్టల ముందుపంటకునేడిదే !
విత్తుచుందుము కోయుచుందుము క్రొత్తయేమియులేఁదికన్
క్రొత్తయెప్పుడు బ్రదుకవలెనను కోర్కెయొక్కటియేయగున్.

మాసిపోయిన రంగుచీరనుమార్చి క్రొత్తదితాల్చియా
వేసమట్టులెయైన వేఱొకవేసమున్ ధరియించుచుం
గ్రొత్తనవ్వులు క్రొత్తపువ్వులు క్రొత్తయాటలు పాటలుం
గ్రొత్తయందము చందముంగని క్రొత్తవేడుక గూర్చెదున్.

భూమిదేవి చరిత్రమిట్టిది, యామెబిడ్డలమగుటచే
నామెత్రోవనెపోదు మరసియొ యరయకో మనమెప్పుడున్.
ఎండగాసిన, వానగురిసిన, నేళ్ల కోళ్లనునేకమై
నిండిపొంగిన, నూళ్లమున్గిన, బండిచక్రము పోలెనే
తిరుగుచుండును వెలుఁగుఁజీకటి సరిగఁగనుచును భూమియుం,
దిరుగుచుందుము దానితో విధిత్రిప్పలంబడిమనమునున్.

మాటపల్కను నాడు కొంచెను పాటపద్దెముఁబాడుచున్
నాటినారము పాటుపడియొకపూట కూలికి సరిపడన్
సూటిగా నడునెత్తిమీదను జుఱ్ఱుమనియెడుఁబ్రొద్దికం
గూటిముంతలుఁవ్రేలు మామిడికొమ్మనీడను నిల్వరే !

రచన
14-9-1928

# 3

# తూఁగుటూయెల

1

ఊఁగవే చెలి ! తూఁగుటూయెల, ఊఁగవేసరితూఁగవే !
రాగవేగ తరంగితామృత సాగరోదర వీచితో,
పూర్ణజీవనభాగ్య వైభవమునను బొంగుచుఁబొరలు క్షీ
రార్ణవేశ్వరు గర్భవీచి నుదీర్ణయౌ సిరికుద్దియై –

మధురమోహన పూర్ణమూర్తిని బుధులు తమ హృదయముల నె
న్నిధిగ నినుఁగనుచుండగా సత్పథవిహారము సలుపుచున్ –
కళలుదేరెడి నీదుమొగమును గఱవుదీఱఁగఁగాంచు పు
ణ్యుల తపంబె తపంబుగాఁదత్ఫలమె కడు సత్ఫలమ్ముగా, –
ఊఁగవే చెలి తూఁగటూయెల ! ఊఁగవే సరితూగవే !
రాగవేగతరంగితామృత సాగరోదరవీచితో !

2

చెట్లకొమ్మల సందులన్ మిఱుమిట్లుగొలుపుచు మెఱసి, చీఁ
కట్లముంచుచు నంతలో మెఱుపట్లుమఱుఁగున డాఁగుచున్ –
అడుగుఁదమ్ముల లత్తుకల సంధ్యారుణాంశువులే కనం
బడగ, లక్ష్మణునకు మహీసుత పాదపల్లవముల్ బలెన్ –

ప్రమద ! నీ నగుమోముచందురు పండువెన్నెల తేటలన్
సుమధురామృత దీర్ఘికాబహువిమలరసముల క్రమమునం,
దమక మూరఁగ దప్పిదీఱగఁద్రావి సరసుల దృక్చకో

రములు త్రుళ్లక పల్లటిల్లక స్తిమితభావమునొందగా -
నడుమఁజక్కని తెల్లచుక్కల నల్లచీర బెడంగనం
బడు తమంబున మోహితాత్మల వెడఁగుచూపులు తడఁబడన్ -

తరుణి! నిముఖదర్శనమె సౌందర్యలహరీమజ్జనం
బరసి చూడఁగ సరసకవులకుఁ బరమమగుపురుషార్థమున్;
అందమునఁ బుట్టితివి నీవానందమునఁ బెరిగితివి నీ
పొందుగని యఖిలమునునొకటే యందమయి యానందమౌ !

3

ఊఁగవే చెలి తూఁగుటూయెల ఊఁగవే సరితూఁగవే
రాగవేగ తరంగితామృత సాగరోదర వీచితో !
గోరఁటాకునఁ గెంపులగు నీచారునఖముల పెంపులం
దారకాళికిఁ జూపనోయనఁ బాఱసాచి పదంబులన్ -

బాలచంద్రుని మేలమాడెడి ఫాలతలమున ముంగురుల్
లీలమై వ్యజనానిలంబునఁబోలె, నట్టువమాడగన్ -

ఎదనుబొదవెడి కోర్కెవెల్లిద ముదుటిగుబ్బలమీఁది ప
య్యెదనె గాదిఁక బ్రిదులఁ జేయగనెల్లబంధచయంబులన్ -
పూవువిల్తుని వైజయంతికవోలెఁ ద్రిభువన విజయంబున్
భావకాళి మనోరథంబుల పంటవైఁ ప్రకటించుచున్ -

4

అమృతపానమొనర్చియున్ భవదాననేందు మయూఖ నా
శములచే, నని మేషభావమలభ్యమై సుఖపార వ
శ్యమునఁగన్నులు మోడ్చుచుండఁగ నక్కజంబున విబుధలో
రమణి ! యూగవె యూఁగులాడని రాగరసభరితాత్మవై -

యోగసూత్రమె యగుఁజుమీ ! యనురాగ సూత్రముచెలియరో,
యూగవేయది యూఁతగాఁగొని, యొకటిగాభువిదివియునున్.

రచన
24-4-1928

4

# వెన్నదొంగ

1

వెన్నదొంగను విడిచిపుచ్చకు, పెనచి నీ భుజలతికలన్
సన్నుతాంగిరో ! పొదివిపట్టుము సందిటన్ బిగియారగా !
సాగనిచ్చుట యాగడంబుల సాఁగనిచ్చుటయే యగున్
వేగలేమిఁక వీని విడిచిన, వేగ లేమియె తలకొనున్. !
కుదురుకొనియెడునట్లు నీ కొనగోర గోరఁట క్రొవ్విరుల్
చిదుమునట్టులు మెఱుఁగు బుగ్గలు చిదిమి చేతులఁబెట్టవే !
అదిపొసంగక యుండినన్ భవదధరపల్లవపుటమునం
దొదుగు పలువిరి మొగ్గమొనలను ఒత్తియొత్తిడిఁబెట్టవే !
పెడమొగంబిడి పెనఁగులాడఁగ దొడఁగెనేనియు సుదతిరో
యెడమచెక్కిలి చిక్కనిచ్చిన యొడుపెఱింగి మెలంగవే !
చెఱకువిల్తుని కఱకుఁదూపుల చుఱుకుగల నీ బెళుకువాల్
చుఱుకుఁజూపులఁబరగఁజేయవె, సోలితూలి తపించెడున్;
వ్రాలినేలను నీదు ప్రోలను ఏలికొమ్మని వేడెడున్

జాలిదలఁచుట కదియ యదనని బేలతనమును బూనుచున్,
ముద్దువెట్టఁగఁబోయెదవు సుమి ! ముక్కుముంగరయాడెడున్ !
బుద్ధివచ్చెడిదనుక దిద్దక దొడ్డకానిని నమ్మరే ?

నమ్మఁదగ దీ యెమ్మెకాని వినమ్రనటనల భ్రమయుచున్;
నమ్మినను సర్వస్వముంగొంపుఁజుమ్మి ! యవ్వలశుద్ధమో
క్షమ్మెసుమి, కడతేఱఁగా మనకాఁపురమ్ములు కొమ్మరో !

మెఱిమి మెఱుముల, నుఱిమి యుఱుముల మేఘమాలిక పోలికం
గురియఁదగు నవ్వెనుకఁజల్లని సరసవృష్టి సుతుష్టిగా,
అపుడుతెయ్యనియాడఁజొచ్చెడు నాడుచుండగఁబించియం
బిపుడుచిక్కఁగబోవుసామియు, నింటఁబెంపుడు నెమలియై.

వీనినడతలు వింతగొలిపెడు, బిలువఁబలుకకయుండు, గ
స్నానఁజొచ్చెడు, వెడలెడును గుమ్మానఁ - తెలియవు రెండునున్.

కంటఁగన్నిది చూడకున్న సుఖంబు భద్రములేవిఁకన్;
వెంటఁబెట్టుక వెడలఁజెల్లదు అంటఁగట్టక కొంగునన్.

2

వెన్నదొంగను జాఱవిడిచితి, వెదకిపట్టియుఁజెలియరో !
వెన్నఁబోవిడనాడి యక్కటవ్రేలునాకుట యయ్యెనే !

పట్టవచ్చునె యునికి పట్టనునట్టి దొక్కటి లేనియా
జెట్టి నేరికినై నఁదానయి పట్టువడకుండినఁగృపన్ ?

పట్టుపడెనొక పట్టునంగృపఁ, గట్టువడె మెడఁజుట్టితా
కట్టువెట్టిన జాజిదండలయట్టి నామృదుబాహులన్ !
త్రొక్కులాడుచు సిగ్గువెఱపులు నొక్కుచుండఁగనోరెటో
"చిక్కితివినీవంటి నేనిదెదక్కితిని నీకంటినిన్"

"మగువకెంతటి తెగువరా" ! యని నగుమొగంబున ననుఁగనన్
మొగమునెత్తఁగ నోడికనులరమూసి మూఁపునడాఁచితిన్.
పట్టియును నేఁబట్టువడినట్లిట్టులుండగ నన్నుఁ జే
పట్టె, మంచునఁదోఁగు క్రొంజివురట్టినాకెంగేలి వ్రేల్
వట్టి యభయంబిచ్చి; యంతటఁ బ్రక్కకును నఁదార్చితా
నిట్టులనియెఁ: గృపామరందము లుట్టిపడఁ గనుదమ్ములన్ ;
"వెన్నదొంగిలి నాఁడనని నను వెదకి పట్టఁగవచ్చియా
వెన్నయిడ్డ సువర్ణపాత్రయు వేడ్కనాకిపుడిచ్చితే !

ఏమి నీయుచితజ్ఞతాక్రమ మేమి నీసరసత్వమో
భామ, యేమనువాఁడ నిఁక, నీప్రేమభంగులపూర్వముల్ !

మోముడాచియు ముద్దులీయగఁబూను నీచతురత్వమో
కోమలీ, పువుడాఁచి వలపులుగొలుపు లతికనె తోఁచెడున్.

అసఘమగు నీముఖమెసుమి కళ్యాణభాజన మింక నీ
యనుపమాన వచోమృతమెసుమి యందుఁగల యమృతంబునున్ ;
ముద్దుమోమిక యింతయెత్తవె, మూఁగనోము సడల్పవే,
యెట్టి నీకు హితంబొవేఁడుమి యిచ్చితిని నినుమెచ్చితిన్."

అనుచు నిట్లుపలాలనము సేయఁగను నేమొగమెత్తి య
ల్లన వచించితి "సామి ! నీకృపగని కృతార్థతఁ గంటి; మ
ద్వదనమేటికి ? దద్వినిసృత వచనమేటికిఁ? గేవలము నా
హృదయమిడి - నవనితకోమల హృదయమిడి-నాజీవితమె నీ
యదిగఁజేయుదు, నది కదా కళ్యాణభాజన మదికదా !

నీదువెలుగున నిలుచుటయును, నీదు పదములఁగొలుచుటయును
సాఁ౹రంబుగనిడవేనాధ, మహాప్రసాదము నాకగున్"
ముదితరో ! యిటులంటినాధుని పదములంటి; విభుండు " నీ
హృదయ వాసుని రమణి, నను నీవెపుడు చేసితివపుడె నా
హృదయ వాపినినైతి" వని, నన్నెత్తియెదఁ గదియించినన్

ధన్యమయ్యెను నాదు జన్మము, మాన్యనైతిని గన్యలం
వన్యమేటికినాకు వే తొరకపుణ్యమేటికి సకి యరో !

నల్లమబ్బును గౌఁగిలించిన నలువునం గగుఁ జల్లనై
జల్లుమనియను నా యొడల్ నిలువెల్లఁ గడిమి బెడంగునన్ :
ఏమి సెప్పుదు నప్పుడో చెలి, యేమి సెప్పుదు : డెందమా
శ్యామసుందరు వగలుగని, యాప్రేమ సాగరు పొత్తుగని, తా
నేమి యయ్యెనొ యెందుఁ బోయనొ యెఱుఁగనే చెలి యెఱుగనే :

మఱచితివి నా బాధలెల్లను, మఱచితిని నీ బోధలెల్లను
మఱచితిని విశ్వంబు, ననుసే మఱచితిని, మై మఱచితిన్ :
వెఱచితిని వెఱపింపఁబోయి వివేకహీనత సామినిన్ :
బఱచితిని నేనెందులకొ, అదిస్వర్గమో : అపవర్గమో :

పారవశ్యము - నిరవధిక సుఖ పారవశ్యము - దక్కనే
వే తెఱుంగను సామితో నొక వేతెఱుంగని పొత్తునన్.

కన్ను మూసితిఁ గన్నగానిని గట్టిపెట్టితో యనం
గన్నుమూయుట తలుపు దీయుటకన్నఁ దప్పిదమయ్యెనే :

గడియ కడచెనో, గంటకడచెనో, కడచె నొక నిముసంబుగా,
విడిచె ననుఁ బయికొన్న మబ్బటు వెడలుచుండగ రవి దివిన్.

కలయఁజూచితి దిక్కులెల్లను, గలఁగి డెందము తొట్రిలన్
గలయ యయ్యెను నాదుభాగ్యము కరఁగిపాఱి యదేడనో !

యమున కోర్కులు నించెనో, తదుపాంత బాలతమాల కుం
జములఁ బెంచెనో, గాఢ మోహతమమున నన్నటు ముంచెనో !
కనులఁబెట్టిన చలువకప్రపుఁ గాటుకట్టులు, కరఁగి పా
ఱెనుగదే చెలి, నాదుఃభాగ్యము కనులు విచ్చి కనుంగొనన్.

రచన
భీష్మైకాదశి
19-2-1929

5

## భావగీతము

చెప్పికొనుమీ చిన్నసఖుఁడా చెప్పికొనుమీ చిన్నసఖుడా -
చెప్పికొనుమీ చిన్నసఖుఁడా మెప్పుగనుమీ బుద్ధిమంతుడ
తప్పుత్రోవను బడకయిదె నా గుప్పిటను గల యర్థమేదో -

కాదు ద్రాక్షామధురఫలమిది స్వాదుమోచాఫలమునున్
గాదు నారికడంబు నే భూఖండమందలి ఫలముగాదిది —

కాదు భక్ష్యము, కాదు భోజ్యము, కాదు దృశ్యము, చింత్యముం
గాదు కాదను వేదపూరుషు కడుపులోనిది వలెనదేదో -

కానిదెల్లను లేనిదేయగు లేనిదెల్లనుగానిదే,
కానిదియునున్ లేనిదియు ననరానిదగు నావస్తువేదో —

ప్రక్కలింపఁ జూచెదేమో పట్టిగుప్పిలి చేతులన్
మొక్కవోవు నృసింహదేవుని యుక్కుగోళ్ల ముక్కలయినను -

పూలగుత్తియుఁగాదుసుమి యిదిక్రోలఁ బుష్పరసంబులన్
వ్రాలినంతనె కొదమతుమ్మెద వలెనె యెడఁదకు నింపుగలుగ -

మెఱుగుదంతపు బరణిగాదిది మేలికస్తురివాసనల్
గురియగుప్పున మూఁతయించుక దెఱచినంతనె దిక్కులందు -

సరస సుక్తిపుటమ్ముగాదిది, విరిసి తనకును దానుగా
మెఱసి జలజలరాలు ముత్తెపుసిరుల నీకు నొసంగుటకును-

పెటికిపుచ్చుకొనంగ రాదిది, పిసిఁడిగొంటు పసిండి దా
పటికమట్టులు ప్రాణములనే బలియిడంగ లభించు నీకు -

చెప్పికొనుమీ చిన్నసఖుడా చెప్పికొనుమీ చిన్నసఖుడా
తప్పుత్రోవను బడక యిదె నా గుప్పిటను గల యర్థమేదో :

భావకవితలలోఁతుపాఁతులు పట్టిచూడగనిట్టివే -
భావకవి హృదయముల గుట్టునుమట్టు గుప్పిటలోనివే -

అడిగిచూడము కోఁతవైద్యుని నన్ఋతమాడితినేమొ, నీ
కడుపులోని దురాశయములను గత్తరించు నతం ; డికన్, -

భావకవితాగాథ విభవ విభావనారతి, నీమతిన్
దావలముకొనెనేని చెప్పెదఁ —
గేవలము నిశ్శబ్దమై,

యనిల సంచలనం బడంగిన యంతరంగ సమాధియో,
కనులు మూయని యోగనిద్రా కలనమోయనఁ బ్రకృతికిన్ -
బెనుపుఁ గూర్చెడి కాలరాత్రిని, విమల గగనాంగణమునన్
మినుకుమినుకను తారకాళి నిమీలనోన్మీలనములే -

యెనయు చుండగఁ దాళగతులయి హృదయతంత్రుల మీటుచున్
హృదయగతుఁడగు గాయకుఁడె పలికించెడున్ ; వినిపించెడున్;
విదితమగు నీ హృదయమునకది వినెడు నేరుపుఁ బొదవినన్ ;

అపుడు పుట్టిన నిసువు నూరుపుకన్న సున్నితమయ్యునున్
విపుల జలధి గభీరఘోష వినిర్భరాంతర గర్భమై
వినగ నయ్యెడు, విష్ణునాభీ విమల కమల మిళింద ని
స్వనము వోలెను, నాదమొక్కటి, సర్వతోముఖమై; యదే
శ్రవణములకు రసాయనంబగు, స్వాంతమున కానందమౌఁ
గవన మదియగుఁ గవియతండగు బ్రవిమలాంతః కరణుడై
యెవడు విని వినిపింపనేర్చునొ హృదయ మలరఁగ దానినే.

రచన
23-3-1929

6

# కోయిల

1

కావు కావని యఱచు నీపలుగాకి మూఁకల యఱపులో
భావమలరఁగ నీవు పాడిన పంచమ శ్రుతిగీతముల్
హాయి గొలిపెను నాకు శ్రవణ రసాయనములై హృత్కృతా
ప్యాయనములై సరస కవితోపాయనములటు నెచ్చెలీ !

ఏమి రాగరస ప్రవాహం ! బిద్దరద్దరు లొరసియీ
భూమియును నాకసము నొకటిగఁ బొంగిపొరలుచు ముంచెడున్ !
ఏమి కోమలగాత్ర మాధురి ! యిక్షురస మెనవచ్చునో !
కామధేనువు పాలమీఁగడ తఱకయేయన వచ్చునో !
నిరుపమానము నీదుగానము, నిన్నెదుర్కొని డింభకుల్
వరుస తప్పిన చప్పచప్పని వంక కూతలు కూసినన్.

2

కాకిఁ గూటనుబుట్టి పెరిఁగితి - కాఱు కోనలఁ బట్టితిరిగితి - వో
కోకిలమ ! యెటులబ్బె నీకీ కాకలీ మృదుకూజితం, బీ

శోకమోహ వివర్జితాంత శ్శుద్ధ సుకవి సుపూజితం
బెట్టులబ్బెనొ ? శీతవాత విజృంభణము దలపోయఁగా
చట్టుబండలకైననుం గడు బెట్టిదము గదసైఁపగా !
రావి చివురుల మెసవితో ? క్రొమ్మావి యివురులమేసితో ?
జీవనౌషధ దివ్యరస సంసేవనంబును జేసితో ?
పూఁడిపోయిన గొంతుక్రోవినిబొడమెరాగ రసంబిటుల్
మోడునను గెంజివురుపోఁడిమి కీడుజోడయినేఁడహో !

౩

ఎల్లయాశల నడఁచుక్రమమున నిరవుకొను పెనుతమమునం
దిల్లుచీఁకటికోణమైనను; నల్లపూసయి పోయినన్
విశ్వనాథుని వెండికొండయు - విశ్వమంతయు వెదకినన్;
విశదవృత్తగుణాఢ్యమనియెడి - వినుతిఁగను సద్గుణమునున్
భృశమునున్ సత్పథమువలనను వికలమైచ్యుతి నొందినన్;
ఇట్టి దయ్యుఁదమోవిభుత్వం, బిట్టి విషమ విరుద్ధ సం
ఘట్టనమునను, నిప్పు నెరసటులిట్టె పుట్టెడు నేదొ సౌం
దర్యరూపము, శమిత తాపము, నవ్యజీవన దీపమై -
ధైర్యబోధము, హృదయచలన స్తబ్ధభావ నిరోధమై,

నల్లమబ్బను తెరమఱుంగును మెల్లఁజిమ్మి మెఱుంగులా
గుల్లముల్లసిలంగఁజేయుచు నొకటనాట్యమ సలిపెడున్.
శూన్యమప్పుడె పూర్ణమయ్యెడు. శుష్కమార్ద్రిము. మౌనమున్
మాన్యతమమగు గానమగు. సామాన్యమిదిమనకో సఖా !

4

సామరస్యమొ, సౌమనస్యమొ సఖుడ ! లేకవి రెండునో !
ఏమి హేతువో నీదుపాటకు నేను ముగ్ధుడనైతిగా !
స్వాగతము ! సుస్వాగతము ! నీ పంచమశ్రుతిగీతికిన్
నీ గుణోన్నతసాధురీతికి - నీకుమాత్రముగాదయో !

ఆటకత్తియ యడుగుఁజూడక పాటకాని మొగంబునుం
బాటిలదు పరితుష్టియని రసభావవిదులందురు గదా !
శ్రోత్రపేయము నీదుగేయము, చూడరాదుగదా జగ
న్మిత్రభావ పవిత్రసదనము, నీ స్వనద్వదనంబయో !

5

దుష్టవృత్తి నిశాచరీ పరివేష్టితకు, భూసుత కొగిం
గష్టములఁ దొలగింపఁ బరమోత్కృష్ట గతిఁగలిగింపనున్
శిష్టవినుతుడు వాయుజనితుఁడ భీష్ట దర్శనమిచ్చెఁగా
వ్యుష్టవేళకు నెదురుచూచు పయోజసమట్టులు స్వీయమా

హృష్టహృదయము భక్తిభావ పరిమళము పెదఁజల్లఁగా!
దవిలినిదురను దైత్యకామిను లవశలై పడియున్కఁచే
నవిహతస్థితి మఱచియితరము నాలకింపఁగ నామెయే,
భువనమెల్లనశోకవనమయి పొలిచి పొంపిరి వోవఁగా
శ్రవణపేయ మొసఁగ్చె ముందుగ రామనామ సుధారసం
బవని జాతకు లోకమాతకు, నవలపర్శనమిచ్చెఁడా
నవనిజాంతర నిభృతలఘుతనుఁడయ్యు నీవలెనే సఖా!

6

ఎన్నుదునునిను రామదూతఁగ గన్నుదోయికిఁగానరా
కున్న; నీమృదుకూజితంబును నెన్నుదును శ్రీరామ వా
క్యముగ, నందుగణింపశక్యముగాని మాధురియబ్బుటన్,
సుమహితామోదాంతరంగ వినూత్నపవనకిశోరసం
ప్రేరితంబయి వీనుదోయికి విందొనర్పుటవేకువం
దొర! నేనును బాడఁదొడఁగితి నందుకొని నీపల్లవిన్
ఊరకుండఁగ నేరకుంటిని నుల్ల ముల్లసిలన్ సఖా!
కోరుకోరిక దీరుఁజుమి మనగొంతు లొకటిగఁగలసినన్.

రచన
1929

7

# త్యాగవైభవము

కాటికేగద పెంచుట కండలనుచు
నున్నరవ్వంత నేతితోనొక్కజ్యోతిఁ
బెట్టి తులసమ్మకడ నొక్కవృద్ధవనిత
వట్టియన్నమెతిను ఘృతవర్జితముగ.

పిల్లపాలని తల్లులు వేఁడిరేని
"లేవనకుఁడీ! మనకుఁజల్లలేకయున్న
గొల్లకడనేదొకాని పోసికొంద" మనియె
నావుపాఁడిగలట్టి గృహస్థొకండు.

పెనిమిటికి బిడ్డలకు బంధుజనులకునిడి
తాను వడ్డించుకోనున్న తఱిని నెచట
నుండియో రాతిరి యవేళ నూడిపడిన
యొక్క యాగంతుకున కున్నదూడ్చిపెట్టి
వండుకొనలేక యిల్లాలు పండుకొనియెఁ
గుడువకయును గుడిచినట్ల కడుపునిండ.

ప్రక్కనిదురించు బిడ్డపైఁ బ్రాకవచ్చు
త్రాఁచుపామును నరికట్టఁ దలఁచిపట్టి
పెనుగులాడి మూర్ఛిలి దాని విసముచేత
వ్రాలి యొకతల్లి యమృతత్వ పదవిఁబడసె.

గాయములచేత దూపిల్లు నాయకునకుఁ
బాటుపడి తెచ్చి యిడెరేరా నోటికడను
కాని యా దొప్పెడు జలంబు నానకతఁడు
వ్రణితుఁడయి యాసపడిచూచుభటునికీయ
బనిచి, చనెఁ దాను పూర్ణజీవనముఁ గోల !

స్త్రీలఁ శిశువుల నెక్కించి చిన్నపడవ,
నోడయడుగంటు చుండంగ, నుల్లములను
నిశ్చల ధ్యాన నిరతులై నిలిపిదేవు
భటులునిల్చిరి ధీరులై బార్లుదీరి;
దప్పిగొన్నట్లు కడుపారఁ ద్రావియోడ
యూరుపోకుండె: నందున్న వారుసకట

- దలలు మునిగిన వరిచేల వలెనుగాక -
తేలిరబ్ధిపయిఁగలప తెప్పలట్లు.

పాఱెడును ధూమశకటి దుర్వారగతిని;
గట్టుతెగఁగొట్టియేఱునున్ గండిచేసి;
లంకె వదలించి యంత నిశ్శంకముగను
జనశతప్రాణములునిల్పి చనియెనూర్ధ్వ
గతిని, యంత్రంబుతో నధోగతిని గనియు.

తనకుగల సర్వమిచ్చి గతాసుఁడయ్యు
దానుఁడక్షయలోక నివాసుఁడయ్యె;
దేశసేవాసముద్ర యాత్రికుల కెల్లఁ
ద్రోవఁజూపెడుజ్యోతియై ధ్రువుడువోలె.

దేశబంధవిముక్తికై తెంపుసేసి
లోకకల్యాణ మార్గంబులోఁదలంచి
త్యాగియయ్యు జీవన్ముక్తుఁడయ్యుఁగనెడు
బంధనము మహాత్ముఁడు సత్యసంధుఁడిపుడు.

ప్రేమ మహిమమె యీ త్యాగవిభవమెల్లఁ
బ్రేమ లేకున్నఁద్యాగమేలేదు మనకు;

చిత్రములుచూడ నీ ప్రేమ చేష్టితంబు
లద్భుతంబులు పరమ గుహ్యారములును,
అన్నిటిని జుట్టికొనెదు, నత్యాశగాదు
అన్నిడిగమ్రింగు - లయకాల యముఁడుగాదు.
చేతులనుజాఁచు గౌఁగిటజేర్చు కొఱకె,

కడుపులోఁబెట్టుకొనుఁ బ్రాణమిడెదు కొఱకె.
ఏమి కావింపఁజాలదీప్రేమ ? మేను
కోసియిచ్చును, చెప్పులుకుట్టియిచ్చు:
నిచ్చునందాఁక నిలుపోపదేమిచెప్పఁ !
ప్రేమకును నాశకును బట్టు విడుపులేదు,

రచన
2-1929

# మొఘల్ సామ్రాజ్య పతనము

1

భారతవర్షమా ! సకల భాగ్యనిధానమ ! సర్వశాస్త్ర వి
ద్యారమణీయ ధామమ ! సమస్త కళావిభవాభిరామమా !
పారహితైక చింతగల పావన ధార్మికజీవనంబు చే
కూరుచు నాత్మశాంతి యెదఁగోరెడి నాదగు మాతృదేశమా !

కూరిమి నీదుబిడ్డలొగిఁ గ్రోలిన వెన్కకు పాలబీదలౌ
చేరువయిండ్ల పిల్లలకుఁ జేఁపితి వే యమృతంబు జీవనా
ధారము గాఁగ నయ్యదె కృతఘ్నుల కయ్యె విషమ్మె యమ్మరో !
క్రూరులు నీదు చన్గుడిచి తొమ్మసె గ్రుద్దుచు నున్కి చూడఁగా;

చేరిచె మీఁదిచేటు మదిఁ జేరిచి చూడక, "వర్తకంబు, వ్యా
పారమొనర్తుమే" మనుచు వంగి సలాములు సేయనుబ్బి, ద
ర్బారుగ పాదుసా నిజనివాస గృహంబున నోడదొంగలం -
జేరిచెనంత నీ సిరియుఁ, జెల్వము, జేవయు, లావు గంగనే !

2

మంత్రము తంత్రమున్ హితసమాచరణ ప్రవణత్వమందు న
త్యంతము గుప్తమైయొదుఁగ, యంత్రబలంబును దోడునాఁగ, సం
చింతిత వాంఛితంబుల ఘటించుటకై తలవేచియుండి ర
క్రాంత మినావసానము శ్మశాన సృగాలములట్లు కోరుచున్.

ఎఱుఁగరు నీదు బిడ్డ లిదియెల్లఁ బరస్పర నాశనోద్యమ
స్ఫురదసి జాలదీప్తి, మెఱుపుల్ బలెఁ గన్నులఁగొల్ప మిర్మిటుల్,
మఱియును మందుగుండ్ల పొగమబ్బును గ్రమ్మ, ఫిరంగి బొబ్బలం
జొరకయుఁబోవ సాధుహిత సూచక వాచక మేమియుం జెవిన్.

నీడకయి పోరి ఫలముఁబోనాడుకొన్న
వెడఁగులే యైరి నీకన్న కొడుకులుమఱి
నీదు వెంపుడు కొడుకులున్ వాదులాడి,
భేదమే లేని దానికై భేదబుద్ధి.

ఒకతండ్రి బిడ్డలయి, నీ
వొక తల్లివి చన్నుగుడిపి యోముఁగ సుఖముం
డక యకట ! విమతులయి చం
పుకొనఁ దొడగిఁ రెండొరులను మొకమోడకయే.

3

వ్రాలెను బాదుషా ముసలిపండయి, యాతనితోనె నేలపైఁ
గూలెను బావుటా, మునుపకుంఠితతేజుఁడు బాబరెత్తిగా
నోలిని మేటియక్బరు, గుణోన్నతుఁడౌ మనుమండు షాజహా
నేలుచు దేనినింకఁబయికెత్తిరొ, యెయ్యది మేరుశృంగముం
బోలెఁబ్రణామపాత్రమయి పొల్చెనొ సర్వదిగీశకోటికిన్.

వ్రాలెనినుండు; రాష్ట్రము నరాజకమున్ బహునాయకంబునై
వ్రీలెను; జిమ్మచీఁకటుల పిండులువోలె మరాటిదండులున్,
మూలలనుండి సిఖ్ఖులును, మూఁకలుగూడిన రోహిలాలు, సి
ద్దీలును రాజపుత్రులును, దేశమునొక్కట ముంపఁజొచ్చిరు
ద్వేల మహాసముద్రమటు, భీషణఘోషణ ముప్పతిల్లఁగాఁ;
బాలుగొనన్ ముఘల్ బలుదివాణపు దోఁపుడు పంపకంబున్,
గూలినగొడ్డుపైఁగవియు క్రూరపురాఁబులుఁగుంగముల్ బలెన్

వచ్చిరియాంగిలేయులు, లటుపైని పరాసులు, బుడ్తకీసులున్
వచ్చిరిడచ్చివారు, తమ వర్తకరక్షకుఁగత్తియెత్తుచుం
జొచ్చిరివిప్లవంబున "యశోధనలాభము, రాజ్యలాభమున్
వచ్చు 'వరాలచెట్టు' దులుపంబయి పెచ్చుగ" నంచు నెంచుచున్.

వచ్చి, రొక్కక్రియయె యెవ్వర్ధ సంపాదకం
బయ్యె*, మూడుపూవులాఱుకాయలయ్యె
ముందుచూతు మదియొౌట జనని!
ఏ మేలుకొౌఱకు వారిమేలుకొౌఱకు.

4

వ్రక్కలు చెక్కలై చెదరఁబాఱిన యా మొగలాయిరాజ్యమం
దెక్కడగన్న సంచలనమెక్కడ విన్నబలప్రళంసలే,
ఒక్కెడనాశలన్ జెలఁగి యొక్కెడభీతి గలంగఁబాఱితాఁ
బెక్కుతెఱంగులయ్యెఁబ్రభుపీరుల చిత్తము తత్తరించుచున్.

పుడమి చలించునట్లుగను బుట్టిన విప్లవమందుఁగోటలన్
గడబిడ పుట్టెఁగాని యొక గాసియుఁజెందవు పేదవారివౌ
గుడిసెలు, పెద్దగాలికిని గూలఁదలెత్తిన పెద్దమ్రాఁకుఁలే,
అడఁగి మడంగి యుండెడి తృణాదుల కెప్పుడు నేమమే కదా!

అరిగాపులము గాము సరివారమే యంచుఁ
గప్పంబు లెగఁబెట్టఁగడఁగువారు
తమతండ్రి సింహాసనమునధిష్ఠింపంగ
నన్యానుమతియేల యనెడివారు

* కృతికర్తముందు వ్రాయదలచుకొొన్న "బ్రిటిష్ సామ్రాజ్యవైభవము." లోనని యెఱుంగునది

సరిహద్దురాజ్యాల బరవసంబున నాక్రమించి
మించఁదలంచి మిడుకువారు
రాజ్యార్థులుండ నర్హత లేమియెఱిగి
రాజ్యంబు సంపాదింపనరయువారు

ప్రాతపగలుదీర్ప వాంఛించువారును
క్రొత్త సఖ్యములనుగోరువారు
నగుచు ననుసరించిరాంగిలేయపరాసు
ముఖ్యులయినశ్వేతముఖుల, దొరలు.

ఏనిక లందలాలు మఱిమెత్తగు నుత్తమఘోటకంబులన్
మానికముల్ సువర్ణములు మంచియమూల్యములైన హారముల్
కానికలిచ్చి యాదొరలఁగానఁగ వచ్చెదరీదొరల్ కడుం
బూనికతో నభీష్టపరిపూర్తిని గీర్తినపేక్ష సేయుచున్.

అడిగిన రేవులందుఁ దమయంగడి సాలలఁగట్టనిచ్చిఁ త
మ్మడుగక సుంకముల్, సరకులమ్ముకొనంగ ననుజ్ఞయిచ్చి, తా
మొదఁబడివారికై సలుపు యుద్ధపు ఖర్చులు చెల్ల, జాఘిరీ
లెడపక యిచ్చి యిట్లు, తమునెంతయు భూవిభులాదరింపగన్.

పెరిగెవర్తకంబు, పెరిగెను రాజ్యంబు
పెరిగె సేన, రెండు పెరుగుచుండ
నొకటి కొకటి సాయమొనరింప నవిమూఁడు
నన్న దేహ బలములట్లు పెరిగె.

5

హైదరు విక్రమించి మహిషాసుర రాజ్యమునాక్రమించి, తాఁ
గాదని యెంతలెంతలను గర్వమునన్ విహరించుచుండ, నా
మీద మరాటులెత్తి తన మీఁదికి వచ్చుచునుండ, హైదరా
బాదు నిజాము సేరె నిరపాయ సుఖస్థితి కాంగిలేయులన్,

మునుపరిగాఁపులైన రసపుత్రులు ఢిల్లిని ద్రోసిరాజనన్,
"వెనుకటియట్ల కప్పములు పెట్టుఁడు, చెల్లునవెల్ల మాకె" - యం
చును మొనలెత్తివచ్చి. తమ శూరులు మేటి మరాటినాయకుల్
చెనకిన మిత్రమండలిగఁ జేరిరి వారును నాంగిలేయులన్.

చేరువ నారికేళవన సీమలయందు, సుగంధబంధురో
దారవనంబులందుఁ, గమలాకర తీరములందు, మంద సం
చార మదేభయానముల స్వైరవిహారము సల్పుచున్న యా
కేరళ రాజ్యలక్ష్మిఁగని కేరుచు భోగరసైక లోలుఁడై,

బలిమింబట్టఁ దలంచి పైఁబడెఁ బ్రతాప గ్రీష్మభానుండు, టీప్
సులతానుండు, తదీయ కోమలతనూ శోభారసంబింకఁగన్,
నలగన్ వాడి, తదీయ మంజులతలున్, మత్తేభవిక్రీడితా
కులితోద్యానవనీ సరోముఖములం గూపెట్టుచుండన్, మఱిన్.

"ఓడదొంగలఁ బాఱఁదోలెద నూచముట్టుగ, నిల్చిపో
రాడి రాజ్యములెల్ల గెల్చి పరాక్రమంబున నేలెదన్;
బాడు చీఁకటి ఢిల్లికోటను బౌరుషం బుడివోవఁగా
గోడనంటిన బల్లులట్లయి గోడుఁ జెందుచు నక్కఁటా !

వీర బాబరు మన్మలుందురె, పేదలై యంబేదలై !
నీరసస్థితి నొండ్లకున్ దయనీయులై భరణీయులై !
వారి పూర్వుల పేరుపెంపును బ్రాభవంబు మరల్చెదన్
వీరభోజ్యము రాజ్యమౌటను వెల్లడించెదనే" ననెన్.

6

బలవంతులగు మరాటుల
బలమును మఱి టిప్పుబలము వారిరువురకున్
బలమొసఁగ ఫ్రెంచి దొరలయు
బలమును నడఁగింపఁజాలు ప్రబలులగుటచే

అభయహస్తమిచ్చి రుభయతారకమంచు
నెత్తువడిన కేరళేభపతుల
కాంగిలేయ ముఖ్యు లఖిల శత్రువనంబు
విఱువ మిత్రబలము పెరుఁగ; మఱియు-

వైరులనెల్లగెల్చి తమవంతుకు వచ్చిన రాజ్యభాగముల్
చేరిచి తొంటివానికి, విజృంభణమైఁదమవర్తకంబు, వ్యా
పారము సాగుచుండ, ధనవంతులునున్ బలవంతులై, మహా
భారతవర్షపాలన విభావిత వైభవ సూచకంబుగా,

నీ సింహాసనమాక్రమించి, యవలన్ నీయొాదలం బ్రొద్దటుల్
భాసిల్ వజ్రము కోహినూరొలిచి త్వద్వైధవ్య చిహ్నంబుగా
నీసామ్రాజ్యముఁజేసి యస్తమితమున్, నిన్నేలుచున్నారనా
యాసప్రాప్తమహా మహీతల జయప్రారంభ సంరంభులై.

ఫ ల శ్రు తి

పులియును సింగముం జెలఁగి పోరుచునుండగ నొక్కనక్కపోఁ
"తలసినవివ్వి నాకు సమయం" బనుచుం జొరఁబాఱి సందునం
గలహనిమిత్తమౌ మృగము గ్రక్కుననెత్తుకపోవ రెండునుం
తెలతెలపోయి దీనతను దిక్కులు సూచుచునుండె నక్కటా!

రచన
18-11-1932

9

# సుప్రభాతము

1

ఉదయమయ్యెను బాలార్కుఁడుదయమయ్యె
సుదినమయ్యెను గనువిచ్చుసుకృతులకును ;
జాలమేల్కఁని వేఁకువజామునందుఁ
గన్నుమూసినవారికిఁగాదుగాని.

పుష్పితోద్యానలతలపైఁ బోలెనతని
మృదుకరస్పర్శ ప్రసరించె మెల్ల మెల్ల
ముందుగా లేచి స్వాగతం బంది యిచ్చు
*తనదుపేరిటి దేశపు తరుణులవయి,

ఏమంత్రము జపియించిరొ
నీమమునిష్ఠయును మెఱయ నెలఁతలు తా మిం
కేమేమిపూజలిడిరో
యామిత్రుకృపాకటాక్షమందుట కోహో !

* జపానుదేశము

దేవ కన్యకలట్టులా తెలివలతని
దివ్యతేజంబుఁ దాల్చిరి భవ్యమతిని ;
కాని కుంతీ మహాదేవి పూనినట్లు
గర్భమాలయందు మాత్రమే కాదుసుండి.

కాదుసుడి యింకసుతుని నొక్కరుని శక్తి
ధరుని గనఁగోరియునుగాదు: తాల్చిరద్ధ
నిత్యకల్యాణులగుచును నెగడుకొఱకె
స్వీయ సకలాంగ రమ్యజీవితములందె.

ఒకయపూర్వశక్తి యొకనూతనోత్సాహ
మొకయపూర్వ నాగరకత గలుగ :
నూతనాభిలాష నూత్నభావనములు
సందడింపఁబొదలి డెందములను ;

వీరపత్నులటంచునున్ బహువీరమాతలటంచునున్
ధీరలంచును శాంతలంచును ధీవిశారదలంచు, శృం
గార శిల్పకళాకలాప వికాసభాసురమూర్తులం
చౌర : పేరు వహింతురీయుదయార్కదేశ వధూమణుల్.

అచ్చరలువోలె నందనోద్యానములను
గుమ్మటములట్టి కేళిగృహమ్ములందుఁ
దల్లులును బిల్లలును వేడ్కలుల్లసిల్ల
మెలఁగుచుందురు తత్సమ మెఱుఁగుబోండ్లు.

కలరే దేవతలంచు నొక్కెడను ? స్వర్గంబంచు నెందేని ? భూ
తలమే స్వర్గము, మర్త్యులే సురలు, నిత్యక్షేమసంతోష స
త్ఫల మెద్దాన లభించునో యదియె తత్కల్ప ద్రుమం ; బింక నీ
యిల స్వాతంత్ర్య మొసంగలేని శుభమున్నే! మోక్షమేయిచ్చెడున్.

ఏతేజఃప్రసరంబుచేతఁ గనిరోయీ జాతి యీపెంపు సొం
పా తేజోవిసరంబు నడ్డుచు పరుండరోక్కపలంబట్లు, వి
ద్యోతంబౌ నెఱిగంట నిప్పుమియ నుద్యోగించి, తీవ్రాగ్ని సం
పాతంబున్ సహియింప కోడివదలెన్ "భల్లూకపుంబట్టాగిన్ !

జయభేరుల్ మొరయించి రంతట మహోత్సాహంబు సంధిల్ల, దు
ర్జయులై శాంతమహాసముద్రమునకున్ సంక్షోభముం జేసిన
ట్టి యరివ్యూహముఁ జించిచెండి యచటం డెక్కెంబు నెక్కొల్పి నూ
త్న యుగస్థాపకులై యపశ్చిములు తద్బాలార్క దేశోద్భవుల్.

* The Russian Bear – రష్యావారు భల్లూక ధ్వజులు. యిచ్చట రష్యా – జపాను యుద్ధము సూచితము.

ఆడంజొచ్చిరి, పాడఁజొచ్చిరి, యమందానంద వారాశినో
లాడంజొచ్చిరి; తెల్లదీవి''దొర ''లౌరా! యద్భుతంబిద్ది! యే
నాడుం జూడము గుండ్లుదేలె నడుగంటన్ వెండులం''చున్ మదిం
బ్రోడల్‌గావున ''మాకుఁదోడగుచు నిల్వుం'' డంచుఁగేల్వట్టినన్.

మును బ్రహ్మర్షి పదంబునందుటకునై పుణ్యవ్రతంబుల్ సుని
ష్ఠనుగావించి కృతార్థతం గనిన విశ్వామిత్రులుంబోలె, భా
జనులై యీ జనులగ్రజాతులయు నీర్ష్యాదృష్టికిన్ మైత్రికిన్
ఘనులై యింద్రుడు స్వరాజ్యమందుఁ, గని మోక్షశ్రీసుఖానందముల్.

జ్యోతిర్మండలమొండు నూతనముగన్ వ్యోమంబు సీమంబునం
దోతేరన్ విని తద్విశేషమరయం దోడ్తోడ యంత్రంబులం
జేతందాల్చి పరీక్షకుల్ బలెనె సంసేవింత్రు వైదేశికుల్
ప్రాతస్సూర్యుని ద్వీపమండలముఁదద్వారాశి మధ్యంబునన్.

చతురంభోధి పరీతభూతల మహాసామ్రాజ్య ధౌరేయుడై,
అతుల ప్రాభవ వైభవోన్నత జయప్రారంభ సంరంభుడై.
కృతరాగాతిశయ ప్రజాహృదయ నీరే జాసనాసీనుడై.
క్షితిఁబాలించును దద్విభుండు మహితశ్రీభోగ దేవేంద్రుడై.

రచన
25-1-28

# 10

## సు ప్ర భా త ము

2

[రష్యా జపాను యుద్ధమున జపాను జయముగాంచగనే, చైనాదేశీయులలో వచ్చిన మార్పు. వారెట్లు స్వాతంత్ర్యసిద్ధికై పోరుసల్పిరో అది అంతయు ఈ భాగమున వివృతమైనది.]

వినఁబడకుండునెట్లు తమవీనుల నుర్మఁగ దుందుభిధ్వనుల్
కనఁబడకుండు టెట్టులిఁక గన్నులఁ బ్రోల నకాల సంధ్యలం
బనుపడఁజేసి మింటనెఱమంటలు మండఁగ గ్రమ్మఁగంబొగల్
మనములు నల్లమందుపెనుమత్తునఁగూరినవారి కేవియున్.

ఆనందధ్వనులున్ జయధ్వనులు నయ్యంభోధివీచుల్ బలెన్
"జీనా" తీరముఁజేరి వా యువశతం జేరెన్ మొగిందత్ప్రజా
నూనస్వాంతములందుఁ; నందుపటుమంత్రోచ్చాటన ప్రక్రియన్
"నీ నిష్ఠం విడుమింక" టంచుఁదరిమెన్ నిద్రాపిశాచిన్ వెసన్.

అవియెకొండలు కోనలు నవియెనదులు
నవియెసంద్రంబు భువియును దివియునవియె
కాని మొగములనొక క్రొత్తకళయెసంగఁ
గానఁబడు ప్రాఁతచుట్టాల కరణిఁబొలిచె.

ఉన్నయట్టులెయుండి తానున్నతత్త్వ
మెటుగడించెనొ పాదపంబటు "జపాను"
పరిణతియెకాని పరిణామ పథము మనకు
గానఁబడకుండుఁబూర్వసంస్కారమట్లు.

మనుజుహృదయంబు పగిది ధర్మంబెమనుజు
సున్నతాదర్శమయి మాఱకుండుఁ; గాల
వికృతినింబట్టి యనుపాన భేదముల న
నామయప్రాప్తి కొంతమందెనడచునట్లు.

ఇట్లునిద్రాసమాధిఁజాలించి కనులు
విచ్చిచూడంగ లోకంబు వెఱఁగుగొలిపెఁ
దూరుపేదియొ పడమరేదొ గ్రహింప
వలనుగాకుండెఁ, బ్రజకు దిగ్భ్రాంతియొదవె.

పీఠితలుపులు మూయక విడిచినట్టు
లోడరేవుల మూయకయుంచి, కనులు
మూసినిద్రింపగాఁబెనుమోసమయ్యె
నయ్యయో ! యేమీ సేయుదుమకటయిపుడు.

ఏమి బలజృంభణంబౌర యీ "జపాను"
పెనుతుపాను విధంబున విసరికొట్టి
యుఱిమి చిచ్చర పిడుగులఁ గురిసి మెఱసి
ధరణిఁ బడగూల్చె రిపుసైన్య తాళవనము !

ఎచటనుండియొ యెవ్వరో యింటఁజేరి
పెత్తనము సేయుచున్నారు వెఱపుదక్కి;
తపముసేయ హిరణ్య కశిపుఁడు వోవ
దొడ్డవోయెఁ దద్రాజ్య మింద్రునకు దక్కి !

వర్తకులమేముః ధర్మప్రవర్తకులము
నిలువనీడ యొసంగిన నిలుతు మనుచు
వచ్చి. కూర్చుండి కాళులు పాఱఁజాఁచి
పెట్టుదురు నెత్తిపయినె త్రివిక్రములయి.

మత్తుమందు చల్లి మైకంబు పైకొల్పి
యొలచి కొంద్రు మేనఁ గల పసిండి;
జలగలట్టులంతఁ జల్లచల్లగఁ బీల్త్రు
నెత్రు; చాపక్రింది నీరు వీరు.

ధూమకేతువె వీరికేతువు దలంపఁ
బూరి మొలవద యది వచ్చుదారిలోనఁ
జెలిమి నిలువదు తండ్రి బిడ్డలకునైనఁ
గూర్తుమంచును జేరి చేకొనిరయేని.

దేశపటముల యందును దిద్దఁగలరు
ప్రాతఁ రాజ్యాల సరిహద్దు గీఁతలెల్ల,
ఫాలతలములఁ దుడిచి వైవంగ గలరు
నలువ వ్రాసిన భాగ్యరేఖలను గూడ.

కాగడావోలె గాఢాంధకారమెల్ల
విరియఁ జేయును వీరినాగరత యండ్రు
కొరవి దయ్యమువోలెఁ దోడ్కొంచుబోయి
కూలఁద్రోయును దాస్యపు గోతిలోన,

పీల్చి గాలి భూభరమును దాల్చు శేష
నకును దలప్రాణమెపుడుఁ దోకకునురాదు
అనదలను బట్టి కడుపుబ్బఁదిని శ్రమమని
యాపసోపాలఁ బడుదురీ యయ్యలహహా !

సమధిక ఫలాప్తికై, స్వవిజ్ఞానమునకు
నంటగట్టి యపూర్వ దేశాగమముల
మూలధనమును ముట్టక ప్రోదిసేసి
పెంచువ్యాపారు లట్టులు పెంపుగంద్రు

తోలుదురు వీరు పశువులఁ దోలినట్లు;
కొట్టుదురు వీరు కుక్కలఁ గొట్టినట్లు
చేరనీయక తమ రాజ్యసీమలందు,
దాటనీయక నిజ బహిర్ద్వారములను.

నిన్నగాక మొన్న కన్ను దెఱచి "జపా"
నగ్రజాతి సభ్యతార్హమయ్యె !
నెదుగుఁబొదుగు లేక యీ "చీన" మిటులుండ
జెట్టుక్రింద మొలచు చెట్టువోలె.

పెత్తనము మీఁద వచ్చెఁ బైపెత్తనంబు;
తొత్తుక్రిందను దొత్తులై యొత్తడిఁబడి
నలుగుచున్నారు వీరల నడుమఁజిక్కి
యకట ! యడకొత్తులోఁ బోఁకలట్లు ప్రజలు.

"దేవతారాజ్యమునఁ బుట్టిచావవలసి
వచ్చె నీరక్కసులచేత భంగమొంది:
ఆత్మరక్షణోపాయ మొండరసిదాన
బ్రతుకవలదె మన మకుతోభయులమగుచు

దేవకార్యార్థియై మున్ను తెగువ నేసి
ఘనుఁడు కచుఁడు ఋష్యాదేశముననుబోలె
మనమును మృత సంజీవని యనెడి విద్యఁ
దగును స్వారాజ్యరక్షణార్థంబు వడయ.

శిష్యులుగఁజేరి శుశ్రూష నేతుమేని
కడుపులోఁబెట్టుకొని విద్యఁగఱపఁగలరు
కంద్రుడు శత్రుమిత్రులనొక్కకంట నెపుడు
నహహా : యపరశుక్రాచార్యులగుచువారు.

ఉష్ణముష్ణంబుచేఁగాని యుడగదంద్రు
వీరి సంప్రదాయపునీతి వీరియెడల
వడిప్రయోగించి సాధింపవలయు మనము
ననుసరించి యుష్ట్రిలగుడన్యాయరీతి"

అనియిట్లు మేలుకని తమ
యునికియు మనికియును నెదుటనుండెడి యద్దం
బునఁబోలె "*గ్రొత్తవెలుఁగు" న
గనుఁగొనియేవంబు పుట్టఁగాదీవ్రమతిన్

అంగసంస్కారణంబును, నంతరంగమత
సంఘసంస్కారణంబు రాజ్యాంగసంస్కా
రణముఁగావింపఁ దొడఁగిరాప్రజలు మాఱుఁ
గాదెయన్నియు నంతరంగములు మాఱ.

కాలికట్లు వీడి గజరాజయానలై
యొప్పిరప్పుడచటి యువతిజనము
వ్రేలుజుట్టులూడి వెలిదీవి దొరబిడ్డ
లవుచు నీటుగనిరి యువజనంబు.

మందులకుఁగాక యీనల్లమందు మనకు
నేఁటికనుచును విసమట్లు పీటఁబుచ్చి
దేవుఁడిచ్చిన తేనీరుద్రావి యెదల
తుష్టినొందిరి యమితత్వదోషమెడల

*జపాను.

పులిని మేకనొక్కకొలన నీర్ద్రావింపఁ
జాలువాడె పుడమినేలువాఁడు
దుష్టశిక్షణంబు శిష్టరక్షణమును
బూనలేనిరాజు, లేనిరాజు.

కాలచోదితములు కర్మంబులెల్లను
కాలమునకురాజు కారణంబు
అతఁడు ధర్మబద్ధుఁడయి రాజ్యమేలంగ
వలయు ధర్మమందె నిలుచుజగము

తనకుఁబెరవారికిని గూడఁ దనదుప్రజను
బానిసలఁజేసి నిజగౌరవమును ప్రజల
భావి భాగ్యోదయంబును భంగపఱిచె,
వట్టియంబేద యేటికీ ప్రభువుమనకు ?

రాజుసర్వాధికార ధూర్వహుఁడయేనిఁ
బ్రజకునది పంచి యీని కారణముచేత
దుర్బలుండగుఁ, గాలు సేతులకుఁబాఱ
కున్నరక్తము, తలబర్వు నూనఁగలదె ?

స్వార్థపరులగు దొరల దుస్తంత్రములకుఁ
జిక్కి వారల కేల్వట్టినిలుచు.
చేవచెడియును బయివన్నె చెడక యిపుడు
చెదలుదిన్న కంబంబు పగిదివితండు

తగస్వదేశస్వరాజ్య స్వధర్మములను
నిలిపిలోకహితంబునుజలిపి పేరు
పెంపువెలయింపలేని యా పేదజాతి
మేకమెడచంటిజాతియై మిన్నకుండు.

తన సమాధివిడిచి తరలిపోఁజాలక
అట్టిపట్టి ప్రాఁకులాడెడి యశ
రీరభూతమట్లు వీరల హృదయంబు
పూర్వమహిమమెంచి పొంగుచుండు

వెనుకటి పేరుపెంపుఁదమ పెద్దలయస్థి చయంబుఁబోలెనే
అనిశము నాంతరంగిక సమాధిని నిల్పి యదేతలంపులో
మునుగుచు మబ్బుపై కొనఁగ ముందుకు వెన్కకుఁజోగి తూగుచున్
దనిసెడు కాటికాపరులఁదార్కొనునే నవజీవ ప్రభల్ ?

వంతులు దెగక యసూయా
వంతులగుటఁ జేసి దొరలు పంచుకొనరుగా
కింతకును మింగ కుండ్రె దు
రంతముగాఁబట్టి చీనరాజ్యమునెల్లన్

కార్యవాదులనుచు ఖడ్గవాదులనుచు
నేకరాశిగతులుగాక ప్రజలు
భేదదృష్టిఁజూచి విషమ పరిస్థితుల్
దెచ్చుచున్నవారు దేశమునకు.

పంపినారట ప్రార్థనా పత్రములను
మేని క్రొన్నెత్తుట లిఖించి తేనికడకుఁ
గత్తిచేఁబూని సమర రంగమునకుఱుక
ముదలయిడుమని యువజనుల్ పొదలువేడ్క

కొడుకు సమరాంగణమునకు వెడలకుండఁ
గాలిసంకెల యైతినిగా యటంచు
వేఱుగతిలేని యొక వృద్ధవీరవనిత
పొడుచుకొని చచ్చెనట పుత్రుఁబోరి కనుప.

స్వార్థము భజించి చెఱలోన నడఁగియుండు
స్వార్థము త్యజించి యాకాశమంటు నరుఁడు
వి_త్తనము రూపుమాయంగ వెడలుఁగాదె
వృక్షము సహస్రముఖముల వి_స్తరిలుచు.

చిత్రకథలుగ జనములు చెప్పికొంద్రు
పాడికొందురు గీత ప్రబంధములుగ
చదువుకొంద్రు మహావీర చరితములుగ
మెచ్చుకొందురు తలలూచి మేలటంచు.

వీరిదేశాభిమానంబు, వీరిస్వార్థ
సంగ పరిత్యాగమును, వీరి సాహసములు
కనులనానంద బాష్పముల్ క్రమ్మ, దేఱ
నుల్లములఁ గోర్కె లువ్విళులూర నహహా!

మగనికిఁ దెచ్చియిచ్చె నొకమానిని యాతనిఁ బోరికంపుచున్
జిగిదళుకొ_త్తఁగాఁ జికిలిచేసిన ఖడ్గము చేతబట్టి నె
మ్మొగము సువర్ణభాజనముఁ బోలి నివాళియొసంగ, స్వారికై
సొగసుగ సంజ నిల్వెడలుచో మును వేత్రమునిచ్చు చెల్వనన్.

మెత్తని పూలపాన్పుపయి మేన సుగంధమలంది కాంతతోఁ
జిత్తమురంజిలన్ మునువసించిన యాసుఖమెంచఁ డంగముల్
నెత్తుట జొత్తిలం గటికినేల జయేందిరతోడి మోహమున్
బొత్తుమఱంగి వీరయువ నూతన సఖ్యరసైకలోలుడో.

"అందగలవిష్వ బిడ్డకు, ననుభవింపఁ
గలడు చెవికాంద్రుఁగూడి యుగాదినాడు"
అనుచునొక వెట్టితల్లి భక్ష్యములువండి
పదిలముగ బంపెనట సైన్యపతులపేర.

"నీకుమారుఁడు వీరుఁడై నిలిచిపోరి
వైరి వీరులదునిమి దుర్వారుఁడగుచు
వారితోడన చనియె నిర్వాణరాజధాని
కేటువడ్డ పులివిధాన," మరియు

"అందుకొనవమ్మ మున్ను నీయనిపినట్టి
భక్ష్యములతోడ మా ధన్యవాదములను
పండుగలులేవు మనవీరపత్నులకును
వీరమాతలకును నేడు వీనికన్న."

11

# దొంగ పెండ్లి

దొంగఁబట్టెదననుచుఁ బోయి దొంగనే పెండ్లాడితే ?

ముంగిలాగునఁ బాలుద్రావిన మూతియెంగిలితో నిటుల్
దొంగ పెండిలికూతురా ! మముఁ దొంగి చూడఁగ వచ్చితే ?
దొంగఁబట్టెదెననుచుఁ బోయి దొంగనే పెండ్లాడితే ?

కోకకొంగునఁ దుడిచికొన్నను కొత్తరంగులు మాసెడున్
నాకి సొమ్మొనరింప నిండును, నీకుఁ గడుపు ఫలించెడున్.
పాయసాన్నము దశరథేశ్వరు పత్నులొక మెతుకేనియున్
బాయ విడిచిరె కఱవు గొంటుల పగిదిఁ దినిరేగాకిఁకన్.

వెడలఁబెట్టుటొ జిహ్వాతృప్తిని, వెక్కిరించుటొ మమ్ములన్
తడవికొనుటో మోవికెంపుల నడచిపుచ్చు తలంపుతో ?

ఏమిసొమ్ములు పెట్టెనే ! నీకేమి కోకలు సుట్టెనే !
ఏమి అవికెలు తెచ్చెనే ! యేమిచ్చి నిన్నెద గ్రుచ్చెనే !

ఒడలనిండను నగలుకావే యూరు పల్లెలదోచి పెట్టెడి
గడనకానిని జెట్టపట్టిన గడుసుదానికి కొదవయే ?

రచన

13-3-1929

# ప్రేమగీతము

ఎండ చల్లఁబడియె నివిరె మై చెమట చి
త్తడులు వట్టివేళ్ల దడుల తడులు.
చల్లగాలి దిరిగె నెల్లవారికి బైటఁ
దిరుగ మనసుపుట్టెఁ దిరిగెఁ బ్రొద్దు.

చెట్ల కొమ్మలు దలలెత్తి చెలఁగి యూఁగెఁ
గొసరి కోయని కోయిల కూయసాఁగె
వాడుపాఱిన పూమొగ్గ పోఁడిసూపె
చిన్నికాల్సేతు లాడించి శిశువుకేరె.

పుడమిరమ్య వికృతిఁ బొందు చుండఁగ నిట్లు
పొందకుండునెట్లు భూరినభము :
కవల పిల్లలట్లు కార్యకారణముల
న్యోన్యమైత్రి నడచు చుండుగాదె ?

జలనిధి నీటందేలుచుఁ
దొలఁకెడి బలుమంచు దిబ్బల వోలెన్
తెలిమబ్బు లొప్పెనప్పుడు
పలపలనై నీలగగన భాగములందున్.

ఏఱుతీసినట్టు లెల్ల దిక్కులఁ బర్వి
నట్టి సూర్యతేజ మపరదిశకు
నోసరిల్లుచుండ నొప్పెఁ బ్రాంతపిశంగ
జలధరములు పులినతలములట్లు.

పలువన్నెల చిరుమబ్బులు
దిలకింపఁగనయ్యె నపరదిక్ప్రమమునన్
బలుతెఱఁగులరంగుల చి
ప్పలు బలె నల చిత్రకారు భవనమున నిటుల్

కీలుకొఁడయి యాశుండు లీలమెఱయఁ
గాలయంత్రంబు నిజశక్తి నాలుకొలిపి
త్రిప్పుచుండంగ విశ్వమన్ తెరనుగానఁ
బడెడు నిష్టైన్నొ చిత్రరూపంబు లహాహ !

గడియ కొకనీటు పచరించి గగనలక్ష్మి
ప్రకృతి వేత్తల మనుకొను పండితులకు
వెఱ్ఱిగొలిపెను బ్రమసి వెన్వంటఁ దిరుగు
పడుచు వాండ్రకు నొయ్యారి భామవోలె

ప్రియుని లేఖ ప్రియమొ, ప్రియు పటంబు ప్రియంబొ
చెలువ కెవ్వరెంచి చెప్పగలరు.
రెండు రెండు కనుల నిండారఁ జూచుచు
హర్షవార్ధి నోలలాడు నపుడు ?

రచన
1915

# ప్రభూ !

దివిజనదీతటంబులను దియ్యని పచ్చిక మేసిమేసి త
త్ప్రవిమలవారిఁ గ్రోలి సురపాదపమూలమునందుఁ గామధే
నువుతొలిచూలిపోలిక మనోజతరాకృతినొప్పి నీదు సే
వ వలను సూచుచున్, నెమరువైచుచు, నందివలెన్, సుఖంబుమై,

ఉండక బందియెద్దునయి యుర్విఁజనించితిఁగాఁడి మోవఁగాఁ
గండలురేఁగి పుండులయి కాయలుకాచిన మూఁపుక్రుంగ ను
ద్దండఁబట్టికొట్టెడును దండధరుండయి కర్మచోదకుం
డండయొసంగి యీ పశువు నాపదలెప్పుడు పాపెదో ప్రభూ !

ఒంటిం జీకఁటి మౌనమూని యొకచేదో మెల్లఁజింతించు కొం
చుంటే వేడ్కగఁదోఁచు నాకెపుడు; నేఁడో యద్దిరెట్టించె; నే
మంటేనిన్ నినుఁగూడియుండుటను, దివ్యంబైన నీ వెల్గుఁగ
న్గొంటన్, నీ పలుకాలకించుట నెదన్, యోగీశ ! సర్వేశ్వరా !

మయికృపాం కురుదేవ సదాశివ !
త్వమసిమే శరణం సుఖకారణం
తవ దిదృక్షురహం దురితాపహం
హృది శుభావహ మంఘ్రిసరోరుహం.

నేలం బ్రాఁకెడి పూవుఁదీగఁవలెనే, నేనుందునోదేవ ! న
న్నీ లోకంబున కేలదెచ్చితివొ ! నాకెచ్చోటు నేమించితో !
పూలా పూవను, మొగ్గలాతొడువనున్, ప్రోదైనఁగానుం, బసుల్
కాలం ద్రొక్కఁగ స్రుక్కుచుందు నిది నా కర్మంబె సర్వేశ్వరా !

రచన
28-10-1923

## — నా దారితోడు

వ్రాలు చుండెఁ బ్రొద్దు పశ్చిమంబునఁ బైకి
దేలుచుండె వఱదతీయు వెనుక
విసుక తిన్నెలట్టు లెసఁగు రమ్యపిశంగ
వర్ణవర్ణనీయ వారిదములు.

కాలిక్రింద మెత్తగానుండె గౌతమీ
సైకతంబు బాటసారికపుడు
పైరుగాలి సుఖము పండఁబాఱిన జొన్న
చేలు మెద్చుచుండె శిరములూచి.

భువియు దివియుఁగలసి మోదించుచుండంగ
నడచుచుంటి నపుడునాకు నేనె
తోడుగాఁగ గొలఁది దూరంబులోనున్న
గమ్యభూమిఁజేరుకాంక్షఁజేసి.

• ఇందు వర్ణింపబడినది 1907 సంవత్సరమున కవికి స్వానుభవమైన సంఘటన.

ఇంతలోన వెనుక నెవ్వరో యొకయింతి
కాలిమడమలిసుకనేలఁగూర
నడచివచ్చుచుండె, నడునెత్తిమూటచే
మందగింప, సహజమందగతియు,

"ఏమిమూట యమ్మ ! యెందుండి యెందుల
కేగుచున్నదాన విపుడు చెపుమ"
యనుచు నాదరమున నడుగంగ నాకిట్లు
మాఱువలికె నాదుదారితోడు.

"పుట్టినింటి నుండిపోదు. అల్లదిగొ ! మా
యూరికయ్యగారు ! మీరొ" యనుడు
"నేనుగూడఁబోదునీవేగు నూరికే
యడుగుపెట్టుమమ్మ ! యడుగువెట్టు.
అకట ! నీకు మూట యంకిలయ్యెడు, నూరు
చీకటి పడకుండఁజేరవలయు"

"మూటపైనమునకు నాటంకమగుఁగాని
పూటగడవదండి, మూటలేక

క్రొత్తకోకపెట్టెఁగుంకంబుపెట్టి. మా
పెద్దయన్న వట్టిపెట్టివాఁడు !
వలదటన్న వినక పచ్చజొన్నల మూట
గట్టినాఁడు నెత్తిఁబెట్టినాడు

అయిననేమి లెండియయ్య ! యిల్ చేరువౌ
కొలఁది మూటబరువు చులకనయ్యె
నడతు వేగ, నడుగులిడుచు మీ యడుగుల
ముందునడుఁడిదొరలు ! ముందునడుఁడి"

అనుచువెంటనడచునా నిష్కపటురాలి
పలుకుచిన్నబిడ్డ పలుకుకన్నఁ
గోమలమును మఱియు శ్రేమార్ద్రమును నౌచు
ప్రియము సేసె నాదు హృదయమునకు.

పాటిరేవుపడని యేటి పాయనుజేరఁ
గానె మమ్ముఁజూచి దోనెవాఁడు
"బాపనయ్యవారు పాయదాటకమున్న
దాఁటరాదు మాలదాని" కనియె

"చేరవలయునిల్లు చీఁకటి పడకుండ
నాఁడుదాన ! నిన్ను వేఁడుదాన !
ఓసరంగుబాబు ! కాసంతకనికార
ముంచుమవల మున్నుడించు నన్ను"

దీనురాలిదైన దీనవాక్యమునాదు
హృదయ మర్మమంటి, యిట్టులంటి
దోనెవానిఁజూచి "హాని యేరికిఁగాని
కలుగరాదు నేను కారణముగ,

పావనము తల్లి గౌతమి జీవనంబు
త్రావుదుమునేను నీమెయు నీవు నదియె
కనులఁ జూచిన మాత్రానఁ గలుష మడగు
మునుగఁ గల్గినఁ గల్గును ముక్తిమనకు

వెలివాడ పుట్టినంతనె
వెలిఁబెట్టునె యీశుఁడతని ప్రేమకుఁబాత్రం
బులుగాని జంతులిలలో
పలఁ గలవే ? గాలిలేని బ్రదుకుం గలదే !

ఒక యీశ్వరు కృప నందఱ
మొక యోడనె యెక్కిదాఁటి యొక సంద్రమునే
యొకతీరమె చేరఁగ వలె
నిఁక నీసంశయము లేల యిచ్చట మనకున్,

కాన సందేహ పడక యోడౌనె వాఁడ !
యేక్కనిమ్మమె నాతోడ నెక్కనిమ్ము
ఎక్కనిచ్చిన నీకేమి యెగ్గులేదు
తఱచి చూచిన నాకేమి తగ్గులేదు''

ధర్మజునిపోల్కి నేఁగాను ధార్మికుడను
అంటరానిదిగాదింతి యతనివేఁపి
యట్టు; లటులయ్యు మేమెక్కినట్టి దోనె
వారలెక్కిన తొలిమెట్టై స్వర్గమునకు.

రచన
21-10-1921

# అన్నయు - చెల్లెలును

ఒక గూటి చిలుక బోదలొ,
యొకతమ్మిమనిద్రావాలు తేంట్లొ,
యొక మోమునం గ్రాల్ వికచ నయన ద్వయంబో,
యొకపాత్రిక వెలుంగు దీపయుగ్మకమొ,
యికన్,

ఒక తొగరు పట్టుదారము
నకు గ్రుచ్చిన ముత్తియముల నాణెపుగవయో,
యొక పూవుం గొమ్మకొనపై
నొక సొగసుగం బొలుచు ముకుళయుగళమొ,
మఱియున్

ఒకచంద్రు కళయుం గాంతియొ
యొకప్రేమము ముద్దుమురిపెమో !
యరయంగా
నొక తత్వమునకుం జెందిన
యకలుష చైతన్యమును మహానందమునో!

అని యిట్టులు నా మనమున
ననుకొందును బట్టరాని యానందమునం
గనుఁ గొందును గేహాంగణ
మునఁ దిరిగెడి శిశుయుగంబు ముచ్చటలెల్లన్.

అన్నదమ్ముల బిడ్డలే యయ్యునొక్క
తల్లికడుపునఁ బుట్టిన పిల్లలట్టు
లీడుజోడుగఁ గూడుచు నాడుచుందు
రన్నయును జెల్లెలును బొత్తులనువుపడగ.

ఆడుకొందమురావె యమ్మాయి ! యనుచుఁ
బాడుకొందమురార యబ్బాయి ! యనుచు
నొండొరులఁ బిల్చుకొని మోము లుల్లసిల్లఁ
గదలుదురు సంబరమె తమ్ముఁ గడచిపాఱ.

పెద్దయడుగిడు మూన్నెలల్ పెద్దగానఁ
జిన్నయడుగిడుఁ గాఁబోవు చెలువగాన
నడుగు లెడమయ్యెఁ జేతులు విడరు శిశువు
లెడములేని ప్రేముడి ముడివడుట కతన.

తుదమొదలులేని ధోరణి వదరుచుండ్రు
తొక్కుపలుకుల భావంబు చిక్కుకొనఁగఁ
బత్రబీజపుటంబు వెల్వడుచునున్న
యిగురు మొగ్గల మొక్క యాకృతియుఁ బోలె.

బొమ్మరాలునుఁ బూలును బ్రోవుచేసి
రెండుచేతుల సమరుచి నిండఁబట్టి
జడలుగట్టినతలలు దుమ్మొదలుఁగ్రాల
గ్రాలుదురు బాలయోగులలీలమెఱసి

ఒక్కపూవుననుండి వేఱొక్కపూవు
మీఁద వ్రాలుచుఁ గ్రోలుచు స్వాదురసము
నాకుచిలుకల నడకల ననుసరించు
వీరి మనములు స్వైరసంచారులౌర!

పూవుఁదోఁటయె యగును భూభువనమెల్ల
బవలురేయును నొకపెద్ద పవలెయగును
ఇహముఁ బరమును రెండును నిండెకలవు
చీకుఁచింతయులేని యీశిశువులకును

రండివత్సలు ! దగ్గఱరండి ! మీరు
వానకాలపు నెలలట్లువత్తురేని
మండువేసంగి నడుగంటి యుండునూయి
వోలెనే నాదుడెందముప్పొంగఁగలదు.

రండిబిడ్డలార ! రండినాకడకుఁ బ్రే
మైక్యభావ మొదవునట్లు మీరు
చిన్నయెదలు గదియజేర్చినాయెదను, నన్
గూడనిండు మిమ్ముఁగూడనిండు

ఎన్నడుంటినొ మీవలె నేనుగూడ !
నెపుడు క్రీడించితినొయిట్లు లిసుకలోన !
నకట ! యాప్రొద్దులాయాట లన్నికడచె
మిగులుదును సాక్షినయి నేనె మిగిలియుందు.

రచన
27-12-1921

16

# కరుణాగీతము

''రెండుపెట్టెలు ! కానికి రెండుపెట్టె !
అయ్యగారండి, కొనరండి'' యనుచునొక్క
చింపిగుడ్డలు కట్టిన చిన్నబాలుఁ
డగ్గిపెట్టెలునాకడ కశిఁదెచ్చె.
తెచ్చియాసఁజేపి తివిరి నాదెసఁజూచు
చున్నవానిఁ బేదచిన్నవానిఁ
జూచియిట్టులంటి, ''నోచిన్నవాడ, నా
కవసరంబుగాదు; అవలఁ జనుము .''
అనినబోకనిలిచి యాబాలుఁడెంతయు
వినయమొప్ప నిట్టులనియెమరల :
''నిండుపెట్టెలండి ! నిలిచికాలెడి వండి !
పుచ్చుకొండియయ్య ! పుచ్చుకొండి !''
''నిండుపెట్టెలెకావచ్చు ; నిలిచికాల
వచ్చు మఱియెట్టిపైనఁ గావచ్చు - నిజము ;

అవసరము కాని దేయెవ్వ రైన సొమ్మ
వెచ్చబెట్టుదురే పొమ్మ వెఱ్ఱివాడ"
"ఇచ్చిపుచ్చుకొనుటయే గాని, యేగాని
బిచ్చమడుగలేదు పేదననుచు
అవసరమునుఁబట్టియడిగెద - గానికి

మూడు పెట్టెలిత్తుఁబుచ్చుకొనుఁడు"
అనిన వానిదగు నుదారభావముఁజూచి
యిట్టులంటిఁ బ్రీతియెసక మెసక;
"అవసరమును బట్టియమ్మెదనంటివే
యెట్టియవసరమ్మొ యెఱుఁగఁజెపుమ"

అనుడు బాలుఁడిట్టులనియె విన్నదనంబు,
వదనపద్మమందుఁ గుదురుకొనఁగ -
"లోకమందుగలవె యాఁకటికంటెనో
యయ్య ! యెక్కుడైన యవసరములు ?
నిన్నరాతిరి దిన్నట్టియన్న మెంతొ
యంతె, మఱిలేదు దిననాకు నింతవఱకు
నెన్నివీధులొ దిరిగితి, నెండఁబడితి
అమ్మలేనైతి నేరుబియ్యమునకైన"

అనుడునిట్టులంటి "నప్ప ! నీ తలిదండ్రు
లెవ్వ ? రెచటనుండు ? రేమిసేతు ?
రేమికారణమున నీ విట్టికష్టంబుఁ
జెందవలసివచ్చెఁజెప్పు" మనిన,

"తండ్రిలేడు ! కలఁడు తమ్ముఁడొక్కఁడు నాకుఁ
దల్లిలేదు సవతితల్లిగాని;
ధైర్యమేధనమ్ము, దైవమేశరణమ్ము
గాఁగనిట్లు మిగులఁగష్టపడుదు"

అనుచు బాలుఁడిట్లు తనకథవినిపింప
వింటి విస్మయంబు వెలుఁగుదోఁప
సంతసమునుగంటి సంతాపమునుగంటి
నొకయణాకుఁ బెట్టెలొప్పికొంటి.

కాని, చిల్లరలేదనిచె
ప్పిన, వేగమెతెత్తుననుచు వెడలెను నాయి
చ్చిన యర్థరూపికను జే
కొని బాలుఁడుదాని మార్పఁగోరినవాడై

వెడలి విపణివీథిఁ బడిపోయి, పోయిన
పోకగాఁగఁ దిరిగి రాకపోయెఁ
గడియయయ్యె - రెండు గడియలయ్యెను - మూడు
గడియలయ్యె - నాల్గు గడియలయ్యె -

ఏ సరికి రాకయుండిన
వేసరియిది యొక్క మాయవేసంబేమో
మోసపడి యర్థరూప్యపు
కాసుం జేవిడిచితి ననుఁగని నగరెజనుల్

మాటతీరుఁ జూచు మర్యాదయునుజూచు
మొగముఁజూజు నేత్రయుగముఁజూచు
నెవడుగాని నరుని హృదయాంతరాళంబు
జొచ్చి శోధజేసి చూడఁగలడె ?

సుజను డన్యజనుల సుజనులఁగా నెంచుఁ
గుజనడెంచు నొరులఁ గుజనులట్లు;
ఎవ్వరెద్ది సూతు రవ్వారి కద్దియ
కానబడుచు నుండుఁగాదె జగతి ?

నేటి చిత్రకథయె నిజమేని సుజనులు
కల్ల నిజము లరచి కానలేక
ఆర్తులైనవారి నరసి ప్రోచుటకును
సంశయింతురని విచారమొదవు,

అనియిట్టు లాత్మ గతమున
ననుకొంటినిగాని, తలఁపు లాక్షణమ కలం
గిన నీటిమీది బుగ్గల
యనువున నడఁగుటయు, సంశయాకులమతినై

"ఏపాప మెఱుఁగఁడేమో!
పాపనిపై లేనిపోని పాపంబుల నా
రోపించి కడకుఁ బశ్చా
త్తాపము పొలగుదునేమొ! దైవమ యెఱుఁగున్

అనివార్యంబుగఁ జిక్కి యొక్కయెడ నీ యాలస్యముంజేసెనో!
అనిమిత్తంబుగ వచ్చి పైఁబడియనో యాపత్తొకండేదియే
ననుమానంపడఁగారణంబు గనతురా దన్నాతురు రండైన, దీ
నుని పైఁ బాపము మోపి పాపపు గతిం బోనాల్లనేనిన్ వెసన్."

అని యిట్లు మనసు ముందుకు
వెనుకకు నురియాడుచుండ "వేసరి యింకబో
వనె పోయెఁ బోయినది, మతి
యును బోనేల"నుచుఁ బోవనుద్యుక్తుడనై

ఉండునెడఁ జీఁకటింటికి
నిండుగఁ జేదివియ వోలె నిలువంబడె నా
దండ నొక బాలుఁడెవ్వడొ
దండిగ నేబులను జేతఁ దాలిచి మఱియున్,

వెడసూపు చూచి గుండెలు
దడదడమన, నోటమాట తడఁబడ, నూర్పుల్
వెడలఁగ, దఱచై యెడనెడ
ముడివడి భయసంభ్రమములు మోమునఁ దోపన్

ఇట్టులనియె; "నయ్య ! యిందాఁక మీకగ్గి
పెట్టెలొక యణాకు బేరమిచ్చి
యర్ధరూపికఁ గొని యరిగిన మాయన్న
చిల్లరంపినాడు చేకొనుండు

మీరున్న యెడకుఁ జిల్లర
మాఱిచికొని వచ్చుచుండ మాయన్న పయిం
బాఱెనొకబండి, గుఱ్ఱము
వారింపఁగరాక వెఱచి పఱచుటవలనన్

పాఱుటయుఁ గాలు విఱిగిమావాఁడు నేలఁ
గూలెఁ, జేనున్న డబ్బులురాలెఁ జెదరి
పడినచో నెల్ల నెత్తుటఁదడిసె, దానిఁ
గనినజనముల నయన యుగ్మములుఁదడిసె

ధర్మవైద్యశాలఁ దానిప్పుడున్నాడు
బ్రదుకుమీఁది యాసవదలివాడు
దిక్కుతనకు, నాకు, దేవుఁడేయని నన్ను
గాంచి కనులనీరు నించినాడు

తక్కుపైకమిచ్చి తప్పునేఁపగమిమ్ము
వేడుకొనఁగ బంపినాడు నన్ను :
మాయమయ్యెబేడ మాయన్నపడినప్పు
డిదిసహించి. యిదిగ్రహింపవలయు"

అని వలకేల్సాఁచియుమో
మునెత్తలేక కనులు నులుముకొనుచు డాకే
లను, దుఃఖమాగమిని నే
డ్చిన బాలుని చేయిపట్టిచెచ్చెరనేనున్

"అడలకుర యన్నకొఱకై
యడలకురాయన్న ! నీకునగు నాపదకై
సడలించి చిక్కులెల్లను
వెడలించెదనిన్ను. భయమువిడువుమి" యనుడున్

చెమ్మగిల్లిన నాకంటి చిన్నెఁగనియొ
యభయహస్తంబుదన కబ్బుటది యెఱిఁగియొ
చిన్నబాలుఁడు నేనిచ్చు చేరుమాలు
కన్నుఁగవ నద్దుకొని తోనకలఁకదేఱె.

ధన్యమయ్యె నాజన్మము ధన్యమయ్యెఁ
జేరుమాలును ధన్యతఁజెందెఁబేద
బాలు దుఃఖాశ్రువులనెల్లఁబాయఁదుడిచి ;
పొందునే ధన్యత ధనంబుముడిచి ? " యనుచు

ఇట్లు హర్షవశతనే మేమొయనుకొంటి,
నదియటుండనిచ్చి యిదివినుండి :
వైద్యశాలనున్న భాగ్యహీనునిఁజూడ
వెడలినాఁడ బాలువెంటఁ గొనుచు.

కాలుదెగఁగొట్టి యచ్చోటఁగట్టుగట్టి
నెత్తుకందువునట్లు నిర్నిద్రులగుచు
వైద్యవర్యులు దన్నుఁగాపాడుచుండ
మంచముననున్నబాలుండు మమ్ముఁజూచి.

"తప్పునైఁపు" డనుచుదండమ్మువెట్టెఁదా
నెత్తలేక చేతులెత్తినాకుఁ
"దమ్ముఁడున్నవాడు దయఁజూడుడీ ! యింక
దిక్కునాకు దేవదేవుఁ" డనియె

అనియొకనిముసముపైకె
త్తెనుగను, లొగిమూసె, మరలఁదెఱచెఁ, దెఱచుడున్
జనినేను మీఁదఁజేయిడి
"నినుదేవుఁడుప్రోచు, బ్రోతునేనీతమ్మున్."

అంటినపుడు బాలుఁడాశ్వాసితుండయి
చూపెఁ బ్రీతికంటఁజూవి - యంత
నింతకంటె వానికేఁ జేయునదిలేమి
యెఱిగి తిరిగినాఁడ నింటివంక

ఏలవచ్చెనాకడకువీఁ ? డేలకొంటి ?
నేలచిల్లరఁదేఁబోయె ? నేలతప్పుఁ ?
గారణమనైతి నేవిధి ప్రేరణమున
బాలుఁడాపత్తునకుఁ బాలుపడుటకకట ;

చూచుదనుకనాకేమియుఁ దోచకుండెఁ
జూచినవెనుక నేమియుఁదోచదయ్యె
మేలుకొన్న సమాధినిఁ గీలుకొన్న
బ్రహ్మవేత్తకు మాయాప్రపంచమట్లు

ఈకడపటి భావమె హృద
యా కలితంబయ్యె, నియ్యుదారచరిత్రం
బూకొంచును లోలోనే
తోకొంచునుబాలుఁ నింటిత్రోవంబోవన్.

రచన
30-1-1915

17

## ఆ ట గీ త ము

వెండిపళ్లెరమున వెలుఁగొందు మంగళ
దీపమనఁగ దివ్యరూపమెసఁగఁ
బాలుద్రావి వెల్లపాన్పుపైఁబవళించి
యాడుకొనరయన్న ! యాడుకొనర !

గర్భవాసమందుఁ గట్టుళ్లఁబడియుంటి
విపుడు నీకుఁదగిన స్వేచ్ఛయొదవెఁ
గాలు నేతులు తెలమిఁగదలించి యాడించి
యాడుకొనరయన్న ! యాడుకొనర !

గ్రుద్దులాడుటకునొ గుప్పిళ్ళువదలవు
సాములెవరిమీద సలిపెదవుర ?
సాము నేయ ముందు సమయంబురానోపు
నంతదనుక నన్న ! యాడుకొనర !

తిరిగితిరిగి తేఱితేఱి చూచెదు చిన్ని
చిప్పలట్టికనుల తెప్పలెత్తి
పాదరసపుబుడ్లు - బాస్కరేందులుకారు
పాలవెల్లియిది - నభంబుగాదు

వింతరంగులమర విన్నాణమేపార
కాగితంపుఱెక్కఁగములు గూర్చి
కుట్టికట్టినట్టి గుడ్డచిల్కఁలుగాని
యందుబారు పక్షులయినఁగావు

మాయవస్తులివ్విమాసిపోవు; నెపుడు
మాయకుండనదియె మదికిఁగూర్చు;
ననెడిపగిదిదృష్టి యట్టెపైకినిగుడ్తు
వౌర! చాపలమొ? సహజగుణంబొ?

ఏదియైనగాని యిదిమంచిసెడ్డల
నరయువేళగాదు; పరమయోగి
యైనఁబొందలేని యానందవార్ధినో
లాడుకొనరయన్న! యాడుకొనర!

# పుత్రశోకోర్మి

ప్రారబ్ధక్షయ కాంక్షినై యిటు లసారంబైన సంసారమన్
వారాశింబడి కొట్టుకొంచు నెటులో త్వత్పాదమున్ తత్కృపం
జేరం జూచుచునుండఁ బట్టినను ముంచెం బుత్ర శోకోర్మి దు
ర్వారంబై యడుగంట ! సిద్ధియిది చిత్రంబో గిరీశా ! కనన్

నా జీవనార్థ మెయ్యది
యోజించి కృపాసముద్ర ! యొసఁగితొ యది త్వ
త్పూజోప కరణ మనియెడి
యోజనఁగయి కొంటిగాఁని యొండుగఁ దలపన్

పూవుల్ పళ్ళెరమందుఁ బెట్టుకొని త్వత్పూజార్థమే నుండఁగా
నీవై యందొకదాని డాఁచితివి మన్నేత్రోప మానంబునే ;
యీవే నాకు సుదర్శనంబుఁగొని నా హృత్పద్మమమ్లానమో
దేవా ! నేహరిఁగాక పోయినను భక్తిం, ద్వత్కృపా పాత్రుఁడన్,

పిలుపులకు నిదుర మేల్కనఁ
దెలియని నరుపేఁపు చఱచి తెలిపెడుక్రియ, నీ
పలుకు శ్రుతిఁ జొరని మొఱకుం
దెలిపెద వాపదల చేతనే ! సర్వేశా !

నిదురంబట్టిన నొప్పి తా నిదురలోనే చక్కనైనట్టు లా
పద లేత్రోవను వచ్చునో, మరలపోవంజాలు నాత్రోవనే
చదలన్ మబ్బులు గూడుఁ బాయుమరలన్ ఝుంఝూమరుత్ప్రేరణన్
మది నంటింపఁ దెఱింగి ప్రాజ్ఞుడిది నీ మాయా విలాసంబుగన్.

19

*

పులితోల్గప్పిన రాసభంబులవలెం బొంకంబుగా శాలువుల్
తలకుంజుట్టుచు, బైని కప్పుచు, విదగ్ధత్వంబు దీపింప న
జులబేల్పుచ్చుచుఁ బూరిమేయు మునిముచ్చుం బండితం మన్యులం
దలఁపంగూడదు, ప్రేఁపబెత్తఁ ల మొత్తంజెల్లుఁగుయ్యోయనన్.

బెదరుగుడ్డలపేరిట, ముదురు రంగు
శాలువులఁగప్పికొని పెద్దశాస్త్రులమని
తిరుగుచుందురు ప్రాజుల తెరువులందు
బెదరునే వీరిఁగని గేదెపెయ్యలైన !

పద్యంబల్లుటయే కవిత్వమని సంభావించు స
ద్విద్యాగంధదరిద్రులెంచనరులే ? పెంజీఁకటిం గానలో
ఖద్యోతంబులఁజూచి నిప్పులనుచుంగ్రాఁగంజలిం బ్రీతిమై
నుద్యోగించెడి వెఱ్ఱివానరులెగా కూహించి చూడంగడున్.

పరమానంద రసానుభూతికయి ప్రాప్తంబైన యోగంబు దొ
మ్మరివిద్దైల్ ప్రకటింపఁబాల్పడిన సామ్యానం, గవిత్వంబు కొం
దఱనోళ్లంబడి యాశుధారలవధానంబుల్ మొదల్గల్గు శూ
న్యరసాకారవికారముల్గని, స్వకీయౌన్నత్యమున్వీడెడున్,

# దొమ్మరి విద్దెలు

అంబరాగదె ! సుగుణకదంబరావె !
తల్లిరాగదె ! దేవీమతల్లిరావె !
కాళిరాగదె ! మహాకాళిరావె !
రాఁగదే యీఁగదే మేలు రమ్యముగను

బ్రాహ్మణోత్తములార ! విద్వాంసులార !
మానధనులార ! యోరాకుమారులార !
భాగ్యదేవతలార ! యోవైశ్యులార !
సుగుణసంపన్నులార ! యోశూద్రులార !

అల్లరికి పుటినిండ్లైనపిల్లలార !
పానకములోని పుడకలౌ బాబులార !
సభ్యవరులార ! యోమహాసరసులార !
విన్నవింతుము వినుఁడు మావిన్నపంబు !

గోఁచిబెట్టనినాఁడె కుఱుచ జేవురుచెడ్డిగరితమై
యొప్పారఁదొడిగినాము
మొలనూలు దారంపు బ్రోఁగుదగునాడె
కానెకోక బిగించి కట్టినాము

మోకాళ్లపయి నేలఁ ప్రాఁకులాడెడినాడె సాఁగి
దండ్యాల్ దీసి యూఁగినాము
బోరగిల్లంబడనేరుచు నానాడె
పిల్లమొరంబులు వేసినాము

చూచితీరంగవలయు మాచోద్యములను
చెప్పినమ్మింప జాలము చెప్పజాల
విద్దెలెల్లమాతోఁ బుట్టిపెరిఁగినవియొ
మేము విద్దెలతోఁబుట్టి యెదిగినామొ !

మమ్ముఁగని పెంచినట్టి మాయమ్మ యెఱుఁగు
నఖిల జగములఁ బ్రోచునాయమ్మయెఱుఁగు
నింక మావిద్దియలఁగాంచి యెంతోమెచ్చి
యిరవులిచ్చిన సరసాళియెఱుఁగు నిజము

తడబాటుగన కేకధాటిగా నొకత్రాటిమీదఁ
బదములు గుంఫింపగలము
పెక్కుబంతులకేల నొక్కమాఱుగబట్టి
లీలపైని నాడింపగలము

సందడిలోఁబెట్టి సభవారిఁగనుగట్టి
వెన్కనుచుట్టలోఁబెట్టగలము
కూర్మకుక్కుట పద్మగోముఖ శిఖి
ముఖ నిఖిలాసనముల బంధింపగలము.

ఊర్పు బిగఁబట్టి యోగులట్లుండఁ గలము
మనసు నేకాగ్రముగఁ జేసియునుపగలము
చిత్ర వివిధావధానముల్ సేయఁగలము
కత్తిమీఁదఁ బరీక్షయీఁగలముమేము.

ముక్కులోనుండి యక్కజంబుగను నోటి
లోని. కటనుండి మఱి ముక్కులోనికిట్లు
వాటమెఱుఁగుచు సూత్రముల్ పన్నఁగలము
క్రిందికిని మీఁదికి సుధీవరేణ్యులార !

ఎలుకపై బిల్లిఁ బిల్లిపై నెలుకదెచ్చి
పెట్టి యాడించి సంతోషపెట్టగలము
కాళ్ళుమీదుగఁ దలక్రిందుగాఁగ నేలఁ
దేళ్లవలెఁ బ్రాకఁనేర్తుము తెలియవినుడి !

కాళ్లె చేతులు, చేతులే కాళ్ళు మాకుఁ
గ్రోఁతులకుఁ బోలె విద్యానిరూపణమున
కుడి యెడమ పట్టదెల్ల లోకులకెకాని
మాకు లేదద్ది రెండు సమములె యగును.

కవులు, మేమును, బడునట్టి కష్టమొకటె
చిత్రవివిధావధానముల్ చేయునపుడు
దానమీకు ఘటిల్లు తాత్కాలికపు వి
నోద మొకటె యిఁ కాదర భేదమేల ?

కవులకిత్తురు గొప్ప కానుకలనుమీరు
చదువు సాములు నేర్చిన సరసులగుట
చదువెఱుంగము మా గురుస్వామియాన
సామె నేర్చితిమతని ప్రసాదముననను.

సామె యనుచు దగ్గింపకో సరసులార !
పూర్ణముగనిండు బహుమతుల్ పుణ్యులార !
దొమ్మరులు దేశ దిమ్మరుల్ డోలుమీద
దెబ్బకొట్టి చాటింత్రు మీ దివ్యకీర్తి.

మా గుఱ్ఱపు సవారి బాగుబాగని మెచ్చి
గోలుకొండ నవాబు గుఱ్ఱమునిడె
మా కత్తిసాము లంగీకరించి నిజాము
బంగారు పిడిబాకు పట్టియిచ్చె
మా గారడిం జూచి మన్నెపు దొరగారు
పెను మాయకొండ్రను బిరుదొసంగె
మా గడ విద్దైకై మాయూరి మునసబు
డాకాలి వెండితోడా యొసంగె.

ఎందరెందతో యెన్నెన్నొ యిచ్చినారు !
హెచ్చుగా నింగ్లీషున వ్రాసి మెచ్చినారు.
సంతపేటల భోగంపుసానిపేట !
లందు నెవివచ్చునవిగాని యాడమేము.

21

కవితా తత్త్వవిశారదుండగుటకై కాశీనవద్వీప వా
సవృథాయాసములేల ? పూర్వభవ సంస్కారంబు, వాణీప్రసా
దవిశేషంబును, గల్గ, మూఁగయు వసంతశ్రీసమారంభవే
ళవనీపాళిఁబింకంబువోలె మధురాలాపంబుఁగావించెడున్.

కవనంబన్నను గాజుకుప్పెఁగొనితేఁగాసంత గంగాజలం
బవునే ? పెద్దలకెల్ల దాహశమనంబై యోలలాడంగఁద
చ్ఛివమూర్థోపరిఖేలదంబరధునీ దివ్యప్రవాహంబులన్
భువిఁబాటింపవలెన్ భగీరథ తపఃపుణ్యంబునన్ గణ్యుఁడై.

ప్రతిమనుజుడు కవియేయగు
ప్రతిమనుజుడు శిల్పియగును ప్రతిమనుజుడు మా
నితసుందరతా ప్రియుఁడగుఁ
బ్రతిమనుజుండీశ్వరునికిఁబ్రతిబింబమకా.

జీవమయుఁడైన యీశ్వరుఁ
డీ విశ్వముఁదనదు కళగ సృజియించినటుల్
భావజుఁడైన కవియే
జీవకళాశోభితముగఁజేయుఁ గవనమున్.

రచన
30-9-1918

# ప్రేమతత్వము

సెలయేటుల్ నదితోడ గూడు, జలరాశిన్ సంగమించున్ నదుల్,
కలికీ! విచ్చలునేడుగాడుపులు సాంగత్యంబు నొండొంటితోఁ
గలుగన్ స్వైరగతిం జరించును మహాకాశంబునం దెంతొ ని
శ్చలమౌ నీశ్వరశాసనంబునఁ; బ్రపంచంబందు నేవస్తువున్,
వెలియై యొంటిగనుండ, దన్నియు నిటుల్ వేర్వేఱ యొండొంటితోఁ
గలయన్, నాకును నీదుపొందు మదిలోఁ గాంక్షింపఁగాఁ గూడదే?
వెలదీ! భూమిధరంబులంబరము చుంబించున్ విలోకించితే?
యలలుంగంకణముల్ సెలంగఁ బరమానోన్యన్యంబుమై నోలలా
డు; లతాంతంబులు మంజుమంజురులతోడున్వీడ వామోదమున్
లలిఁ గూర్పన్ సరసాళి కంచితగతిన్ లక్షించి; సూర్యుండిలా
లననం గౌఁగిటఁజేర్పవేయి కరముల్ సాఁచుంగదే; చంద్రుడున్
గిలిగింతల్ స్వకరంబులన్ గొలిపి పొంగించున్ సముద్రంబు; వా
రలకౌగిళ్లను, ముద్దుముచ్చటలు, నేలానాకు? నీవొక్క మా
ఱలసాలోల విలాసపేశల శుభాపాంగావలోకమ్ము లిమ్ముల
నాపైఁ బ్రసరింపఁజేసి కృపనన్ ముద్దాడకున్నం జెలీ!

---

షెల్లీమహాకవి "Love's Philosophy" కావ్యము - అనువాదము

రచన
1891

## శాకుంతలనాటక ప్రశంస

తొలిపూవుల్, కడపండు లేఁటివరుసం దోడ్తోడ సేవింపగా
వలతేనిన్, వలతేని జీవితసుసర్వస్వంబుఁ బ్రాపించి, భూ
తలముక్ స్వర్గము రెండుఁ గూడునెడ నాత్మానందసామ్రాజ్య సం
కలనన్ నిల్వ. మదిన్ శకుంతలనె సంకల్పింపు లక్ష్యంబుగన్.

గొథే - (Goethe) - జర్మన్ మహాకవిచేసిన ప్రశంస

రచన

14-5-1924

# జీ వి త ర హ స్య ము

కలయనుకొందునో నిజముగాఁగయికొందునొ లేక రేవగల్
గలసిన సంజయందునొ తలంపగ దేవరహస్యమట్టులై
తెలియఁగరాకయుండెడును దెల్పెడివారును గానరారిఁకన్
వెలువడుపెట్టులిద్ది కనువెల్తురునుంగను మర్త్యవాక్కునన్.

అరుదగు మర్త్యజీవితరహస్యము : దీని నెరుంగ భూనభోం
తరమున సందులగొందుల ననారతముంబరికించి చూచితిం,
దిరిగితి సాధుసంగతిని, దిర్గఁగవై చిత్రగ్రంధకోటులన్
మఱియుఁదదేకనిష్ఠమెయి మౌనముదాల్చి తపంబు సల్పితిన్.

చుక్కలమెల్లగా నరసి చూతమటంచును మింటివంకనేఁ
జక్కని చిమ్మచీఁకటిని జీమచిటుక్కన నాలకింపనొ
నొక్క నిశీధవేళఁజెవియొగ్గి వినందమకించుచుం గనన్
దక్కుచుఁదారుచుం జనియెఁదారకముల్ ననుఁజూడకుండనే.
చక్కని వాడటంచును రసాత్మకుఁడంచుఁగళా విభూతిఁబెం
పెక్కిన వాఁడటంచు మదినెంచి భజించితిగాని చంద్రుఁడుం
బక్కున నవ్వెడుం గడుపువ్రక్కలుగా ననుఁజూచి, వెఱ్ఱినై
త్రొక్కుడులాడుచుంటకును, దూరపుఁగొండల నున్నెఱుంగమిన్.

రచన
17-10-1927

(అసంపూర్ణము)

# రాజా రామమోహనరాయలు

జన సంఘములయందునిల్చిన దురాచారములంబాపి స
న్మాని సంసూచిత ధర్మమార్గముల సొంపుల్ సూపి దేశాభివృ
ద్ధినిమిత్తం బనిశంబుపాటుపడి సత్కీర్తుల్ దిశలనిండగా
ఘనుడై మించిన రామమోహను కథల్ గావింపవే మోదముల్ ।
సత్యంబేకడనున్న గ్రాహ్యమను విశ్వాసంబుతో లోకసం
స్తుత్యప్రక్రియ భిన్నదేశమతముల్ శోధించి బోధించెగా
సత్యంబొక్కటె యంచుఁ గానఁబడు వైషమ్యు ల జానపుం
గృత్యంబంచును రామమోహనుడు సంక్షేపించి వేదార్థమున్.

రచన
27-9-1917

# పెండ్లికానుక

శ్రీ వాణీ గిరిజాతాలన్ దృఢతర ప్రేమాను బద్ధాత్మలన్
భావోపేతల లోకమాతల నొగిన్ వక్షోముఖాంగంబులం
దావిర్భూతరతిన్ భజించుచు జగద్వ్యాపార పారీణులౌ
నా వేల్పుల్ త్రిజగద్గురుల్ కృపఁగనన్ హర్షింతురీ దంపతుల్.

ఎవఁడు మహానుభావుడయి యింపగు నూతన రాగబీజమున్
యువయువతీ జనప్రతతి యుల్లములన్ మొలకెత్త జేయునో
చివురులు పూలు పండ్లొదవఁ జేయు నెవండు వసంతుఁగూడి యా
పువు విలుకాని సత్కృషి సుభోజ్యమునిచ్చులు వీరికయ్యెడున్.

వెన్నెలబైటి యాటలను వీనుల విందగు వీణెపాటలన్,
సన్నని గాలి వీవనల సౌరభముల్ వెదఁజల్లు మల్లెలం
జెన్నగు మంచిగందముల సేవలఁ గ్రొన్నెల రాలతిన్నెలం
గొన్నన వింటి వేల్పునకుఁ గూర్తురు వీరు సభక్తిపూజలన్,

కేళి గృహాంగణంబునొక క్రేవనెసంగెడి గున్నమావిపై
సోలుచు వ్రాలు గాలులకు సుంత చలించెడి కొమ్మయూయెలన్
వ్రాలుచుఁ దూగుచున్ గొవబు పల్కులు పల్కుచుఁ గీరశారికల్
వేడుక పెండ్లి పెద్దలయి వీరికిఁ గూర్చెడు ముద్దుముచ్చటల్

తగసువర్ణ సవర్ణయేయగు "సువర్ణ !"
అట్టియావర వర్ణిని జెట్టవట్టి
తనదులబ్ధ వర్ణతగుణోత్కర్ష మొందఁ!
జేయుఁగాత "సుబ్రహ్మణ్య" ధీయుతుండు.

సత్తతులకెల్ల మేలెంచు సరసుఁడితఁడు
తారకోన్నతికిని గీడు దలఁచు నతఁడు
వడు గతండెప్పుఁ గ్రొంబెండ్లి కొడుకితండు
పేరెగాక, సోలునె యీ కుమారునతఁడు,

మగని యర్ధాంగమగుచు నీమగువ యట్లు
మగువ యర్ధాంగమగుచు నీమగఁడుకూడ
వేడిమియు వెల్గునిచ్చుచు జోడు దివ్వె
లట్టులిలునిండు వస్తులై యలరుచుండ్రు.

పూగమునుబట్టి పెనఁగెడి నాగవల్లి
వోలె నీ శ్రీసువర్ణయుఁ గ్రాలుగాత
రాగరంజిత ముఖియౌచు రమణుఁగూడి
భవ్యభగవత్కృపా సుధాప్రాపణమున.

పూవుందావియుఁ గూడి నట్లమరఁగం బొందెంతొ ప్రాపించుచున్
భావైక్యంబును మాధురీ మహిమచేఁ బాల్ చెక్కరల్ వోలెనే
శ్రీ విస్తార సుఖ ప్రపూర్ణులగుచుం జెల్వొంది యీ దంపతుల్
సేవింపంబడుచుండ్రుగాక ప్రజచే శ్రీ విష్ణుమూర్తుల్ బలెన్.

రచన
18-5-1928

# సోదర స్మృతి

అరుదగు మర్త్యజీవితరహస్యము పేరిటికజ్జమేదొ నీ
కరమునఁబెట్టిమూసి, కనుగప్పి, వెసన్నినుదోడికొంచు నే
మఱుగున కేగెనో సురిఁగి మాయపుమృత్యువు, చిన్నిబాలుఁడ
స్కరుఁడునుబోలె నీయిహము సంగ్రహింపదలంచి తమ్ముఁడా !

మనగోదావరిమీఁది వంతెనగ సంభావింతు నోతమ్ముఁడా ।
అనుభూతంబది నీ, కయోమయము నాకామృత్యు ; వా సేతువ
ల్లనువై యుండునె రాకపోకలకు భూమ్యాకాశ సీమంబులన్ ?
జనుచుండ్రే పటువాసనావశులటన్ సంసారయాత్రాపరుల్.

ఆరెడిదివ్వె కాంతివలయంబెటుడిందుఁ గ్రమక్రమంబుగన్
బాఱెడియేటి వెల్లినడుమం జిఱులంకయెటుమ్మునుంగు అ
ట్లారయు నేత్రవైద్యుఁడగు నల్ల సదాశివు మత్తుమందుచే
కూరుచు మబ్బులోఁ దెలివిగ్రుంకఁగ నే నఱసావు సూచితిన్.

ఈయింటం గుడుతుము మన
మాయింటం బండుకొందు మనుజ ! తలఁపుమీ
యీయుభయ కార్యసదృశము
లేయగునో జీవితంబు నీమరణంబున్.

మరణమన్నను దేహంబు మార్పెయగుట
దానికయి భీతినొందఁడు జ్ఞానియెపుడు
శిశువు దేహంబు పెరిఁగి పుష్టినివహింప
మరణమని దుఃఖపడుదుమే మార్పుసూచి ?

ఇంతన్ గ్రంథసమాప్తియంద్రు, తరువాయేమాత్రమున్ లేదటం
డ్రంతర్వేదికిఁబోలె నూళ్లవల లేవండ్రయ్యయో, ఆత్మకున్ ;
సంతప్తాంబుధి బాష్పమట్లది యదృశ్యంబైదివింజేరి, ఆ
సంతాపంబు శమింప వెండి చినుకై జాఱన్ భువిందమ్ముఁడా !

కడుపునఁగొన్ని డిందెదు, నకాలపు మృత్యువె చాతకంబుగాఁ
బుడమిని రాలుఁగొన్ని. తడుపుంబయిపై నటుకొన్ని, కంటినీ
ర్వడుచునుకొన్ని, నించుఁబరితుష్టిగఁ జిన్కులుకొన్ని, శుక్తిలో
బడినవి మత్తియంబులయి స్వామికి హారముగూర్చుఁదమ్ముఁడా !

అవలియొడ్డుఁజేరి కుతియాఱగఁ గ్రోలుము స్వచ్ఛజీవనం
బీవలియొడ్డునం బసులయెక్కుడు త్రొక్కుడుచే జలంబు పం
కావిలమయ్యె ; నైననదె యంబరగంగ యటన్నపూర్వ సం
భావనజేసి త్రాఁగుదుము. వాస్తవమిట్టిదికాదె తమ్ముఁడా !

ఒకచన్నిదరి తల్లిగౌతమికి, నీ యున్నట్టియా యొడ్డువే
ఔకచన్నైయెసఁగన్ సహోదరులమై యుప్పొంగ జీవామృతం
బకలంకస్థితి గ్రోలుచుందఁమిక, దాహంబగ్గలంబౌటనా
సుకృతీ ! నీ వధికంబు గ్రోలుదు విదేసుమ్మీ విభేదంబనన్.

నీ కూర్పాసమునేఁబయిందొడుగుదున్ నీ పాగ నేఁజుట్టుదున్
నీ కష్టంపడి కట్టినింట నిలుతున్ నిత్తీవునాయాత్మలో
నీ కన్నట్టి యనుంగు బిడ్డలనిఁకన్నేఁజూతు నీ కంటనే
నీకున్నాకు విభేదమెక్కడిది నేనే నీవుగా తమ్ముఁడా !

రచన
1923

# కుసుమాంజలి

తృణకల్పుండను నేనే, నాదుమతియుందేజోనిధీ ! దానిపై
నణుమాత్రంబగు మంచుబొట్టయిన నీ యవ్యాజ కారుణ్యవీ
క్షణసంపర్క మహార్హ్మఖంబులను గల్గన్ వెల్గిసుశ్లోక స
న్మణికాంతిన్ వెదజల్లుగాక జగదానందాను సంధాత్రియై

నిలిచెదు నా హృదాలయము నెక్కొని కోరికపుట్టినప్పుడేఁ
గొలుచుట కందుబాటుగను, గ్రుంకెద భక్తిరసంపుముంపునన్
దలపఁగ నాకు క్షేత్రమవు, దైవతమున్ మఱిపుణ్యతీర్థమున్
వలసినదెల్ల నీవ, యిఁకభావనయే ఫలదాత్రి, యీశ్వరా !

నీకుం బ్రీతిగఁబుణ్యకర్మచయమున్ నేఁజేయుదుంగాకనే
నాకాంక్షింపనుగాక తత్ఫలము నీ కర్పించు పేగాని నీ
శ్రీకృత్పాదసరోజ సేవనము నీ చిత్తంబె నా భాగ్యమం
చీకొంచున్ సుఖియింతుగాక కృతినై యేప్రొద్దు సర్వేశ్వరా!

నీ యౌన్నత్యము, నన్ సృజించుకతనన్ విఖ్యాతమై యొప్పెడున్
నాయాధిక్యము నిన్నుఁజేడ్చు కొని యన్వర్థంబగున్ లోకమం
దోయీశా ! మణికాంచనంబుల మిథోయోగంబునుంబోలె నెం
తో యేపారును నీవు నేను నొకటౌయోగంబు సర్వేశ్వరా !

ఎన్నోచోటుల నిల్చికాని యొకమై నెక్కంగ నేనోప నీ
యౌన్నత్యంబున కో జగద్గురుడ ! దివ్యంబైన నీతేజమున్
గన్నుల్ మోడిచికాని చూడఁదగనుం గాకుండ మిర్మిట్లు; నా
యన్నా ! నాకడ కీవరావలయు నన్నర్థింగనంగా వలెన్.

మక్కువమీఱఁ గోరికొన మాటుమణంగి, తలంచుకోక పో
నెక్కడనుండి వ్రాలెదవొ యిట్టెనను బయికొందు నిద్రయ;
ట్లక్కజమయ్యెడుం, దెలివియక్కఱ లేదిఁక నిన్గనంగ, నో
తెక్కలికాడ ! నీవరుగుదెంతువు చీఁకటిలోనె యీశ్వరా !

ఒడలన్ దగ్గఱి యంటినట్లులగు, వాయుస్పర్శముంగాదు; న
ల్గడలం జేర్చెడు నొక్కచోటి, కయినం గాదంధకారంబునన్
గడెయుం గంటయు జామునుం దెలియ వైనన్ నిద్రయుంగాదు; బ
ల్విడిమై వృత్తివిశేషమొందు హృదయావిర్భూతమై యీశ్వరా !

హృదయాకాశము మీఁదిమీఁదికిని నీవెక్కంగ నెక్కంగఁ జి
న్నదికాఁజొచ్చెడు, నాదు నీడవలెనే, నాచిత్తసంకల్పమున్
గుదురై నిల్వఁగ నీవు నట్టనడుమన్ శూన్యంబగున్ హే విభో !
పొదలున్ వెండియు నీవు డిగ్గినఁ దమః పుంజాకృతిన్ దాల్చుచున్.

ఈవున్నేనొక తల్లిబిడ్డలమెసుమ్మీ ! యొక్కపెన్‌దివ్వటీ
నే నెల్గించిన జోడు దివ్వెలమె సుమ్మీ ! యీశ్వరా ! నాకికన్
నీవేపెద్దవు ముందుపుట్టు కతనన్, నీక్రిందనేనుందు; ఆ
హా ! ఏంతో నిఁక నీవునేను నొకటే యా దివ్వటీ వెల్గులో

మౌనమ ! చంచ లేంద్రియ సమాజ కవాటపిధానమా ! నినున్
ధ్యానముసేతు నాపయిని నల్లనవ్రాలుము; శాంతిదేవికిన్
మానుగనీవు నాల్కవఁట నాచెవి నూఁదవె తద్రహస్యమో
మానిత భావరత్నఖని — మాటలు వేయును నేలనాకిఁకన్ !

రచన
1923

## శుకవిలాపము

తల్లికడుపున బుట్టినయెల్ల జంతు
వులకు సహజంబుగాఁ బొందఁగలుగునట్టి
స్వేచ్ఛయు స్వతంత్రతయును నే నెఱుగనైతి !
యెట్టిపాపవిజాతినో యెఱుగనైతి !

చూడం బుట్టము ప్రొక్కు దైవమనకిచ్చో నొంటిమైనుంటి, నే
నాఁడైనం జెఱపీడునే ! కలుగునే నాజాతితోఁ గూడియా
క్రీడారామ విహారసౌఖ్యములఁ బేర్మింబొందుటల్ ? నేఁటికిన్
లేదేయొక్కమహాత్ముండెందును మొరాలింపంగ రాఁడేయిటన్.

ఇమిడికకు నిమిడికయు విపు
లమునకు విపులంబునయి తలంప మహావా
క్యమువోలె నెసఁగుమాచరి
తము వినుఁడీ వినుతు ప్రశమము తలకొనకుండన్

జననంబందితి గౌతమీతటిని నాసర్వేశు దివ్యాలయం
బునకుం జేరువ నొక్కరావితొఱటం బుణ్య ద్విజ ద్వంద్వలో
చన సాఫల్యము సేయుచుం బెరిగితిన్, జన్మాంతరోపాత్తనూ
తన సంస్కార విశేషరమ్యతను వుచ్ఛ్వాసిల్లు చుండంగడున్.

దూరస్థ బాల్యచరితము
జేరువకును దెచ్చి నాదుస్మృతి చూచెడు ని
ష్ఠారసి కనుచీఁకటిలోఁ
దూరుపువెలుఁగపుడు నా నిదుర కన్నులటుల్.

చల్లదనమ్ములల్ల వెదజల్లుచు వీచు ప్రభాత వాయువుల్
మెల్లనొడళ్ల సోఁకఁగను మేల్కొని కన్నులుచల్లఁగాఁగ, నా
తల్లి నఖండ గౌతమిని దండ్రి మహేశు గృహోపరికిన్ విరా
జిల్లు పసిండికుండఁగని చెందుదు లోవెలినే శుచిత్వమున్

అగ్గలపుఁతమపుఁదెర స
మ్యగ్గతిఁ గాలార్చకుడు నిరస్తము సేయం
బ్రాగ్గర్భాలయ సీమను
దృగ్గోచరుఁడగుచు వెలుఁగుఁ దేజోనిధియున్

వందనము నిగమమూర్తికి
వందన మరవిందమిత్రపాద సహస్రా
మందరుచిపూరకల్పిత
మందాకిన్యాక్రమిత సమస్తాశనకున్.

ఈయనువున మా యయ్యయు
మాయమ్మయు టెక్కలెత్తి మాటికిమ్రొక్కన్
నా యెఱక మొలకయిగురు, ల
హా ! యెత్తగఁజూతుఁదగుదునయ్య యటంచున్.

ఏగూఁటిచిలుక పలికెడు
నాగూఁటిపలుకెయనుట యథార్థముగాఁగన్
నా గురులేగతి నడచి, ర
దేగతి నేనడతునకట, ! యెగురుటవెలిగా.

విశ్వమూర్తికి నటుమ్రొక్కి విడక జతను
దుశ్శకునభీతి నిటునటు తొంగిచూచి
పోవుదురు తల్లిదండ్రులు భుక్తికొఱకు
ముక్తికయి శ్రద్ధయు వివేకమునుబలె, నహో !

పోయిపరికించి యయ్యై
ఛాయలవృక్షాలి ప్రాలి సంభవమగు నే
కాయయొ పండొ ఫలంబో
యా యీశ్వరుఁడేదియిచ్చునది కొంచుఁదగన్.

ముక్కులను గఱచికొనుచున్
ఠెక్కులవడి, గుండెయదటు, ప్రేమాతురతన్
మిక్కిలియు వెల్లడింపఁగ
గ్రక్కునఁజేరుదురు కోటరంబును; నేనున్.

వారిరాకఁజూచి నోరుదెఱచుచుండు
నడుమనడుమ నులివు లడరఁజేసి;
అంతలోన శివుమహా నివేదనకాల
ఘంట మ్రోఁగుచుండు గ్రంగుమనుచు.

కన్నకడుపుగాన, మున్నుగా నాతల్లి
యీశ్వరప్రసాద మిదియటంచుఁ
దియ్యఁబండునోరఁదినిపించి యంతటఁ
దండ్రి కిడుచు వెనుకఁదాను గుడుచు.

ఆవెనుక సంజదనుక ద్విజాళి, శివుని
దేవళంబునఁబరిసర స్థావరములఁ
జేయు శ్రుతిమధురాలాపసేవ, ప్రొద్దు
జరుగఁగన్నులుమోడ్తు మీశ్వరుని దలఁచి

చిన్ననాటి ముచ్చట లెంతచెప్పికొనినఁ
దనివి దీఱదుగద పెద్దతనమునందుఁ !
గష్టకాలానఁ దొంటి సుఖంబులెంతొ
స్వల్పములు నైతమునువచ్చు స్మరణమునకు.

అవ్వెల్లఁ దలఁచి కొనఁగనె
యువ్వెత్తుగ గూఁటనుండి యుప్పరమునకున్
జివ్వునఁ బాఱెడి ఖగమటు
లవ్వెనుకటి కాలమునకు నాత్మయెగసెడున్.

అహహ : వర్ణింపనలవియే యాసుఖంబు
నా విశాల వినిర్మల జీవనంబు !
ననుభవైక వేద్యమె యదియగునుగాని.
ఈఁకుఁదెదియిచ్చు నదానఁదృప్తినొంది

యన్నెమును బున్నెమెఱుఁగక యతనిఁగొలిచి,
స్వాంతముల సత్సధ విహార చింతదక్క-
నొండు చింతలుమాని మే ముందు మల్ల
భ్రమానితొరట ననూనరాగాను బంధ

బంధురస్నేహ సంభృత స్వాంత శాంత
పావనాభ్యాగత ద్విజ స్వాగతంబె
యూర్జితంబైన వ్రతమయి యొప్పుచుండఁ
గోటరమునుండి యాశ్వరు గోపురమున
గోపురమునుండి యశ్వత్థ కోటరమున
వ్రాలుచుంటలె తీర్థ యాత్రలుగమాకు

రచన
1921

# ని ర్వే ద గీ త ము

ఎవరితోఁ జెప్పికొందు నీ హృదయభరము
నెవరు హరియింతు రీవొక్కఁడవును దక్క
హరుఁడ వగుటను బ్రణతార్తి హరుఁడవగుట
నీవ, శరణంబు, శివ ! మహాదేవ ! నాకు

తల్లి చాలదు, చాలదు తండ్రియేని
యన్నదమ్ములు, ప్రియసఖు, లాలుబిడ్డ
లెవరుఁ జాలరు హరియింప నీభరంబుఁ
దుడువ మసిగాదు. దులుపను దుమ్ముగాదు

గుండెపై నుండి యొకపెద్ద నిండుబండి
పట్టి లాగించుకొవి. పెద్ద బండఱాయి
బెండుఁబోలెను బూవుల చెండుఁబోలె
నెట్టివైచిన జెట్టియు నెట్టనోడు.

కొలదిభూమిని ధరియించు కొండయెంత ?
గాలిఁదేలుచుఁదిరుగుభూగోళమెంత ?
యింతయంతనిచెప్పంగ నెడములేక
పట్టిక్రుంగించు నాదుహృద్భరముచెంత ?

ఇచటనున్నది యీ బాధ యిట్టిదనుచు
విప్పిచెప్పఁగనేరక వెక్కి వెక్కి
యేడ్చుబిడ్డవిధంబున హృద్గతార్తి
నుస్సురనుచుందు వేడినిట్టూర్పులొలయ

నీవు సర్వజ్ఞుఁడవుగాన నీ కెఱుంగ
రానియర్థంబులీ జగత్త్రయినిలేవు
ముక్కుమూలములేని యీ పొక్కునకును
మూలమదియేదొ యరసినన్ బ్రోవుదేవ !

తుష్టియడఁగెను మఱియసంతుష్టి హెచ్చె
నాశలడుగంటె జగముశూన్యముగఁదోఁచు
గానియదియేమొ శూన్యంబుగాక హృదయ
మధికతరభార పీడనంబనుభవించు.

నిలువఁబడలేక క్రుంగుఁగ్రిందికిని గాళ్లు
తాళుకొనలేక మ్రొగ్గిక్రిందను ధరిత్రి
ఘోరపాతాళబిల మనునోరుదెఱవ
నందుఁబడిపోవుచున్నాఁడ నయ్యొనేను

పోవుచున్నాఁడనెచటికో పోవుచుంటె
యెఱుఁగుదును దాని యొండెద్ది యెఱుఁగనకట !
యంధకారావృతంబైన యంధకార
మేదికననీదు నీదు సత్కృపను జూపు.

రచన
-8-1919

## 30

## మృ చ్ఛ క టి

అరువదియేండ్ల ప్రాయమున నబ్బిన దాస్యవిముక్తికుబ్బి, మై
బొరసిన చెమ్మటార కడప్రొద్దును జల్లని చెట్టు నీడలో
సరసకవిత్వ గోష్ఠులను సల్పుదలంచితి; గాని యాశకుం
బరువముగాగ శక్తికిని వార్ధకమౌటను విస్మరించితిన్

చీకటిబాసివెల్గుగని చెందితిమోదము — నేమతాంతర
స్వీకృతి చేసికాదుసుడి - సేవకవృత్తినివృత్తియౌటనే !,
కాకనుబుట్టి మింటబలెఁగంటను గ్రమ్మ అమబ్బుగ్రమ్మి, పెం
జీకటి చేసెనావెలుగుఁ జింతితమొక్కటి సిద్ధియొక్కటిన్

ఎన్నేండ్లయ్యెనో - దివ్వెతోడుగ - నిజంబేగ్రంథమున్‌విప్పి, యిం
కెన్నేండ్లయ్యెనో - ప్రొద్దెసాక్షి - కనియే నింపార దూరస్థముల్
గన్నుల్‌గల్గు ఫలంబు నిద్రగనుచేకావించి, యే కూలియో
యన్నం బింతగడించి తెచ్చి తినుచే యయ్యెంగదా యక్కటా !

కన్నుల్‌మోడిచివెల్గు జూడగలనో. కాలాడకుండంగ నా
కన్నింటం దిరుగాడఁ దెర్వుగలదో, యత్యద్భుతోపాయ సం
పన్నంబేయగుగాక కాలమిది మాపన్నప్రపన్నుండ ! ఛె
ల్లున్నీకే యటువంటి యోగమహిమల్ యోగీశహృద్గోచరా !

*The Broken Toy – కవి ఆంగ్లమున వ్రాసిన మకుటము

అసహాయోద్యమ వీరపత్నివలె నేత్రాకారకారాలయ
వ్యసనోద్విగ్న మదీయదృష్టియు నసూర్యం పశ్యయైయుండి. సా
రసకోశాంతరసంగి భృంగిపగిదిం బ్రాణేశువిన్ జూచు, తీ
వ్రసముత్కంఠను దత్తఱించెదును దేవా। మోముజూపంగదే !

ఈజగమెల్లనీమొగము, యిందుత్వదీయ విభూతిరేఖతో
దాజతగూడుచుం ద్రిగుణ ధర్మవిభాగమెసంగ, నీజగ
త్పూజిత దివ్యసృష్టియును, భూరికృపారసవృష్టియున్, మహా
తేజ ! త్వదుగ్రదృష్టియు, సదృక్తతిగాంతురు మూడుబంతులన్.

దూరపుకొండలందరకు దోచువినీలపయోదమాలికా
కారములట్లు, నామనకకన్నుల కవ్వియుమబ్బులేయగుం
గారణభేదమందొదవు కార్యఫలంబొకటయ్యునున్, రసా
ధారముగామి బ్రీతికి నిదానముగాదుకవీశుదృష్టికిన్.

దేహబలంబు, దృగ్బలము. ధీబల. మర్థబలంబు మానసో
త్సాహబలంబులేని యలసారపు జీవనమెన్నినాళ్లు ! హా
శ్రీహరి ! నన్నుమృత్ప్రతిమ చేసినలంచెదు. నీదుకేళికా
తూహలమూరదేని మఱి దోపవొయన్యము లాటవస్తువుల్

గుంటల్ వడ్డకనుల్. కపోలతలముల్ కోల్పడ్డమైచాయయున్.
గెంటుంగుంటునుజూపుతూఱునడకల్, కేలూతలుంగల్గియే
వెంటంజూచిన హేయమీప్రతిమనే ప్రేమించిపాటింతటుల్
పెంటంద్రోవక చాపలంబొయిది నీలీలావిలాసంబొకో !

తలచిన మాత్రనే యెదుట దాబొడ సూవుట లేనెలేదు, తన్
బిలిచిన బల్కకుండెడును, నిల్చినతావున నిల్వకుండెడుం
బొడిచిన నెట్లొలేచు గనుమూసి వెసందలవాల్చుఁ బెట్టిలో
పలనిదురించు పెద్దముదిపాము విధంబున బుద్ధి యక్కటా !

ఒక మూల దిరుగ వైవ ని
కొక మూలం గురియు నోటి కొంపయగును నా
దు కళేబరంబికెట్లు ప్రబ
దుకనగు బుద్ధియును మాఱు త్రోవంబోవన్.

ఈడ్చితి ఱాలరప్పలను మృచ్ఛకటంబలె నన్నుఁబట్టి నీ
పీడ్చితి మద్దితోలనెడి యెన్నికతోఁ బెనుమిఱ్ఱుగొఱ్ఱులం
దూడ్చితి మేని పైపొరల; నోర్చితి నింతయు నీదు వేడ్కకై
మోడ్చెద గేలుదోయిని, విముక్తి నొసంగవె గోపబాలకా !

రచన
19-10-1932